# ఊరికే జీవితమై..

బి.వి.వి. ప్రసాద్

కవిత్వం

2016–2022



***OORIKE JEEVITAMAI..***
*Telugu Poetry*
*by* ***B.V.V. Prasad***


| | | |
|---|---|---|
| © | : | Poet |
| First Edition | : | February 2023 |
| Cover Design | : | Ramana GV |



| | | |
|---|---|---|
| Poet's Address | : | B.V.V.Prasad<br># 23-12-21, Sajjapuram<br>TANUKU W.G.Dt 534 211 |
| Mobile | : | 90320 75415 |
| Email | : | prasadbvv1@gmail.com |
| Website | : | bvvprasad.blogspot.com |



| | | |
|---|---|---|
| For Copies | : | Namadi Sridhar 93968 07070 |
| | | Navodaya, Hyderabad 92474 71362 |
| | | Aneka, Vijayawada 92472 53884 |

| | | |
|---|---|---|
| Price | : | Rs. **150** |

# మరికొన్ని మాటలు..

నలభై యేళ్ళ స్నేహం కవిత్వంతో. ఇక ఇది ముగింపుకు వచ్చిందేమో తెలీదు. కవిత మళ్ళీ పలుకుతుందో, లేదో తెలీదు. కాలేజీ కాలపు ఉద్రేకాలతో నా మీదికి దూకి, ఉక్కిరిబిక్కిరి చేసాక, తెలియరాని వెలితి వల్ల లోచూపులోకి మలుపు తిరిగాక, తెలియని సత్యాన్నీ, తెలిసీ, తెలియని జీవితాన్నీ, తెలుసనుకొంటున్న మనిషినీ తడుముకుంటూ, గ్రహిస్తూ, విస్మరిస్తూ, నేర్చుకుంటూ, విడిచిపెడుతూ పట్టరాని ఆనందమో, దుఃఖమో, దిగులో, భయమో, వెలితో, నిరాశో, ప్రేమో, ఆశ్చర్యమో కమ్మినపుడల్లా, వాటి నీడలేవో ఇక ఊరికే కూర్చోనీయని క్షణాల్లో రాయడం మొదలు పెట్టి, రాయడంలోంచి లోలోతుల్లోకి మునుగుతూ, కవిత ముగింపుతో పైకి తేలుతూ, రాసింది సరిచూసుకుంటూ, నన్ను నేనే మనిషిగా, కవిగా చెక్కుకుంటూ, ఇస్మాయిల్ అన్నట్టు, దీన్ని నేను నడిపిస్తున్నానో, నన్ను ఇది నడిపిస్తుందో తెలియకుండా సాగిన విభ్రాంత సమయాల కవిత్వ స్నేహం ఇక ముగిసిందేమో, తెలీదు. ముగిసిందనుకోవటంలో తోసుకువచ్చే ప్రేమ వుంటుంది, కొనసాగుతుందనుకోవటంలో భరోసా ఇచ్చే ఉదాశీనత ఉంటుంది.

. . .

చాలాసార్లు ఆగాను, మళ్ళీ చాలాసార్లు నడిచాను ఈ స్నేహంలోకి. ఆగినపుడల్లా నేర్చుకుంటూనే ఉన్నాను, బహుశా, తెలియకుండానే. కవిత్వం అంటే ఏమిటో, వస్తువు ఏదో, శిల్పమేదో, మనిషి ఏమిటో, మనస్సు అలజడి ఏమిటో, జీవితమంటే ఏమిటో, ఈశ్వరుడంటే ఎవరో, సత్యమంటే ఏమిటో, సౌందర్యం ఏం చేస్తుందో తడుముకుంటూనే, వేసట పడుతూనే, మరింత సాంద్రతలోకి, లోతులోకి, విశాలత్వంలోకి నన్ను నేను విడిచిపెట్టుకుంటూనే ఉన్నాను. నేను అంటే మనసు, మనసు అంటే భయం, వెలితి, దుఃఖం, ఆరాటం. మనసు అంటే ఎక్కడుందో తెలియకనే, నేనుగా ఆవహించి, నన్ను ఉక్కిరిబిక్కిరి చేసే మృగతృష్ణ. దీనినుండి బయటపడాలి. దీని ఉపకరణాల నుండి విడుదల పొందాలి. గొప్ప శాంతిలోకి, తేజస్సులోకి, ప్రేమలోకి మేలుకోవాలి. ఇలాంటి లోలోపలి వత్తిడి ఏదో నన్ను ఇంత దూరం నడిపింది. దూరం నిజంగా ఉందా. దూరమంతా ఊహ మాత్రమేనా. కాలమైనా నిజమేనా, కల మాత్రమేనా. ప్రశ్నలు, జవాబులు, సందిగ్దతలు. ఇవన్నీ నిజమా, కల్పనా. ఇవన్నీ ఎవరికి నిజం లేదా ఎవరి కల్పన.

. . .

కొన్ని చదివి ఆశ్చర్య పడ్డాను, కొందర్ని చూసి కూడా. ఈ రాతలు, ఈ జ్ఞానులు నిజమేనా. బహుశా, నిజమనే నమ్మాను. బహుశా, నిజం కావాలని నమ్మాను. ఏదో ఒకటి నిజం కాకపోతే ఏదీ ఆలంబన. దేనికి ఆలంబన, ఎందుకోసం. మనస్సే తనని తాను మెడపట్టి గెంటలేదని అర్థమైంది అనుకొన్నాను తొలినాటి రాతల్లో. నిజంగా అర్థమైందా. అర్థం కాలేదా నిజంగా. ఇన్ని రాతల తర్వాత, నేను మొదలైనచోటనే ఉన్నానా, మొదలే లేనిచోటికి చేరుకున్నానా. ఒక తెలియనితనం కమ్ముతోంది. కమ్ముతోందా, దానికి నేను లొంగుతున్నానా. తెలియనితనంలోని హాయి మాత్రమే, నిశ్చింత మాత్రమే నిజమా. తెలుసు నుండి విడుదల పొందటానికే ఇంత వేసట పడ్డానా. బాల్యం అమృతకాలం. దేవుడు ఊరుకోక తనని జీవిగా చేసుకొన్న తొలి వేకువ సమయం. మళ్ళీ బాల్యంలోకి, మళ్ళీ ఏమీలేనితనంలోకి వెళ్ళటానికి ఎంత దుఃఖం, ఆరాటం, అలసట, ఘర్షణ. ఎన్ని భ్రమావరణాల సంతోషాల, బాంధవ్యాల, అభిరుచుల, అలవాట్ల, నమ్మకాల మొరటుదనాల నుండి బయటపడాలి దీనికి. ఎంత భాషనీ, సమాచారాన్నీ, సంస్కృతినీ వదిలించుకోవాలి, ఎన్ని భయాలని ప్రేమలోకి డీకోడ్ చేసుకోవాలి. అన్నీ వదిలించుకుని వచ్చి, ఎంత అమాయకత్వంలోకి ఊపిరి పీల్చుకోవాలి.

. . .

భాషకి విరుగుడుగా రాసుకొన్న భాష ఈ కవిత్వం. శబ్దాలనుండి నుండి నిశ్శబ్దంలోకి జారిపోవటానికి చెక్కుకున్న మాటలు ఈ కవిత్వం. మనస్సునేను నుండి లేనినేనుకి లేదా ఉన్ననేనుకి చేసే దీర్ఘయాత్ర ఈ కవిత్వం. ఇది నాలోంచి పలికినప్పుడు, బహుశా, కేవలం నాకోసమే పలికిందేమో తెలీదు. ప్రియమైనవారెవరో చెవిలో చెప్పిన మాటల్ని, బజారులో పంచుకొన్న వెర్రివాడిలా, ఈ మాటల్ని లోకంలోకి జారవిడుచుకున్నానేమో తెలీదు. మీకు జీవితం అర్థం కాకపోతే మీ కవిత్వం చదువుకోండి అని స్నేహితురాలు అన్నట్టు, నాకైన మాటల్ని నేను వినటం మాని, ఇలా పలుకుతున్నానేమో తెలీదు. పలికానా, పలికాయా. ఏ శక్తులో అత్యల్పమైన మనస్సుని వెదికి, వశం చేసుకుని, దానిద్వారా ఈ మాటలన్నిటినీ పలుకుతుందేమో. చాలాకాలం తర్వాత, నా రాతలు నేనే చదువుకుని, ఇతను ఇలా ఎలా ఊహించాడు అని ఆశ్చర్యపడే క్షణాల్లో, రాసింది నేను కాదనిపించడంలో నిజముందేమో తెలీదు.

. . .

నేనే రాశాననుకొంటే, బడాయిగానో, బేలగానో, ఇవి దేశ, కాలాంతరాల్లో ఉన్న నాలాంటి వాళ్ళకి రాసుకొన్న ప్రేమలేఖలు అని చెప్పవచ్చును. చదివినవారూ అక్కడే ఆగి, కవిత్వానికి అటువైపు నుండి ఇటు వున్న కవితో స్నేహం చేయబోతారు కూడా. కానీ, ఒక గొప్పవాక్యం ముందు మోకరిల్లే మనుషులుంటారు. రాసినవారో, చదివినవారో. వారికి మాత్రమే ఆ వాక్యంలోకి, దాని అర్థమిచ్చే వెలుగులోకి ప్రవేశించటం తెలుస్తుంది. వారికోసం ~~ఈ~~ గాలి నిండా, ఆకాశం నిండా శుభ్రమైన వాక్యాలు పసిదేవతల్లా ఆడుకొంటూనే, వెదుకుతుంటాయి. అవి కొన్నిసార్లు అనుకోని మలుపులో అక్షరాలుగా కనబడవచ్చు, అనుకోని క్షణంలో అంతరంగంలోనే మెరవవచ్చు. వారు ఆ మెరుపులోంచి అనంతంలోకి మాయంకావచ్చు.

ఇంత అద్భుతమైన మెరిసే మాయవస్త్రాల తెరల లోంచి చిరునవ్వే జీవితానికి నమస్కరిస్తూ..

2.2.23 10.15 రాత్రి బివివి ప్రసాద్

తణుకు

# క్రమసంఖ్య

# ఊరికే జీవితమై..

నువ్వూ, నీ జీవితమూ మినహా
మనసులో మరేమీ లేని
అనుభవాన్ని పొందావా నువ్వు

ఇది నా ప్రతిభ, విజయం
ఇది నా సంపద, కుటుంబం
నా కీర్తి, అనుభవం అన్నట్లు
ఇది నా జీవితమని
ఎప్పుడైనా తలచావా

ఉత్త జీవితం
ఏమీ లేని జీవితం
ఖాళీ జీవితం
ఎప్పుడైనా తాకిందా నిన్ను

ఆకులమీంచి సంధ్యావర్ణాలు రాలిపోతున్నాయి
పిట్ట ఒకటి ఆకాశాన్ని విదిలించుకొంటూ స్వేచ్ఛలోకి ఎగురుతోంది
ఏ అర్థమూ లేని ఖాళీ చప్పుడొకటి
గాలిలోంచి నీ మీదుగా నిశ్శబ్దంలో కరిగిపోతుంది

ఊరికే చూసావా జీవితాన్ని జీవితంగా
అద్దంలోకి కాక, ఉత్త అద్దాన్ని చూసినట్టు
జీవితంలోకి దూకకుండా ఉత్త జీవితాన్ని చూసావా

నిన్నేమీ అనని జీవితాన్ని
నీ తప్పు, ఒప్పుల్ని పట్టించుకోని జీవితాన్ని
నీ సుఖదుఃఖాలు తాకని జీవితాన్ని
ఊరికే శ్వాసలా నిద్రలోనూ నిన్ను విడవని జీవితాన్ని

రంగూ, రుచీ, స్పర్శా, వాసనా లేని జీవితాన్ని
తలచావా
గుర్తించావా
తమకంగా కౌగలించుకొన్నావా

ఊరకనే జీవితమైపోయావా ఎప్పుడైనా

రచనా కాలం : 19.8.2019 10.30 ఉదయం, అరుణాచలం
ప్రచురణ : వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 16.3.2020

# చిన్ని జీవితాన్ని

ఒక చిన్ని జీవితాన్ని జీవించి వెళతావు
కాఫీ రుచి చూసిన దానికన్నా చిన్నది
పక్షి కూత కన్నా, చినుకు రాలటం కన్నా,
సూదిమొన కన్నా చిన్న జీవితం

పసిపాప నవ్వు కన్నా తేలికైన జీవితం
ప్రియురాలి చూపు కన్నా హాయి గొలిపే జీవితం

మరణిస్తానన్న భయం తప్ప
నీ జీవితాన్ని పెద్దది చేస్తున్న
విషయమేదీ ఇక్కడ లేదు

మాయమౌతానన్న బెంగ తప్ప
ఈ జీవితాన్ని భారం చేసేంత
సారమేమీ ఇక్కడ లేదు

తెలియకపోవటమనే ఆకాశంలో
తెలియటం ఒక మేఘంలా కదిలి వెళుతుంది
లేకపోవటమనే అనంతంలో
జీవించటం ఒక కలలా కరిగిపోతుంది

పనిలేక గాలికి తిరిగినట్టు
పనిలేక జీవించి వెళ్ళిపోవటం బావుంటుంది

ఎందుకు బ్రతికావని
ఎవరూ అడగకూడ దనుకొన్నట్టే
ఎందుకు వెళ్ళిపోయావని కూడా
ఎవరూ అడగకూడ దనిపిస్తే
జీవితానికి పరమ గౌరవంతో నమస్కరిస్తావు

బహుశా, అప్పుడు
జీవితం కూడా నిన్ను
మహాప్రేమతో గాఢంగా హత్తుకొంటుంది

22.8.2020 12.30 మధ్యాహ్నం
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 21.9.2020

# ఆ!

ఆశ్చర్యం!
ఇంత పెద్ద జీవితానుభవం
నిన్నేమీ చేయలేకపోయింది!

నక్షత్రాలు
నీ చీకటి తటాకంలో
ప్రతిబింబాలై తేలిపోయాయి

రంగులూ, ఛాయలూ
నీ పగటి అద్దంలో
ప్రతిబింబాలై మునిగాయి

భయాలూ
భయాల్లాంటి సంతోషాలూ
నీ మసకచీకటిలాంటి కలలో
కనిపించేలోపు మాయమయ్యాయి

ఆశ్చర్యం!
పిచుక రెక్కల గాలి
పర్వతాన్ని ఏమీ చేయలేనట్లు
నీ ఉలికిపాటులాంటి జీవితం
నిన్నేమీ చేయలేక పోయింది!

28.7.2020 11.40 ఉదయం
సాక్షి దినపత్రిక 17.8.2020

# నిద్రలో

1
నిద్రలో ఎక్కడుంటావు నువ్వు
మెలకువలో నీ దేహాన్ని మోసీ మోసీ అలసిపోయాక
దానిని ఎక్కడకు విసిరేసి, ఎటు వెళ్ళిపోతావు

సృష్టికి పూర్వం ఉన్న ఏ శీతల నిశ్శబ్ద ప్రశాంతతలోకి
నిదురించే వేళల రహస్యంగా ప్రవేశిస్తావు

గాయపరిచే ప్రపంచాన్ని చెరిపేసి,
భౌతిక వ్యాకరణానికి లొంగని రంగుల లోకాలని
నీ నిశ్శబ్దసీమలో ఎగురవేస్తూ ఆడుకొంటావు

2
మెలకువ ఉత్త ఉలికిపాటు
చిరంతన శాంతిలో రేగే కలకలం వంటివీ దృశ్యాలు, శబ్దాలు

రేగిన అలలన్నీ అలసిపోయి, విశ్రమించేవేళ
ఏ దయాపూర్ణ శూన్యం పొగమంచులా సమస్తాన్నీ కప్పుతోంది

3
మృత్యువులాంటి గాఢనిద్రకీ,
సుషుప్తిలాంటి మృత్యువుకీ జీవులపై ఎంత దయ

ఊహలాంటి జీవితంవలని జీవులపై విసిరి
విరిగిన నవ్వుల్నీ, విరిగిన కన్నీళ్ళనీ వడకట్టి ఒంపుతుంది

శీతలరాత్రి వేళ తోసుకువచ్చే చీకటి అలలాంటి నిద్రలోకి
వాళ్ళని అమాంతం ఎగరేసి లాలనగా నవ్వుతుంది

4
చాలు అన్న మాట చివర ఏముందో ఎప్పుడన్నా చూసావా
చూరునుండి చివరి బిందువు జారిపోయాక,
గాలితెర ఒకటి ఇక ఇక్కడేమీ లేదని చెప్పి వెళ్ళాక,
వెక్కి వెక్కి ఏడ్చిన తరువాత,
చివరిగా ఒక గాఢమైన నిట్టూర్పు కాలంపై చెరగని సంతకం చేసాక

నీదైన ఏకాంతం నిన్ను కమ్ముకొని
అడవినీడల దుఃఖపుశాంతిలో నిన్ను విడిచి వెళ్ళాక

చాలు అన్న మాట చివర
పూవులో ఒదిగిన తేనెకణంలాంటి శాంతి మెరుస్తూ కనిపిస్తుంది

నిద్రలో నీ జీవితం ఎటుపోయిందో
ఈ చివరికి చేరినపుడు తటాలున తెలుస్తుంది

5
అంతే, ఇక చాలు కదా..

19.11.2016 12.53 మధ్యాహ్నం
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 1.1.2018
కవిత్వం 2018. కవిత 2018

# జన్మ

'మళ్ళీ జన్మ ఉంటే ఎలా పుడతావు' అందామె
సన్నటి జల్లు పడుతోంది
దేవుడు చినుకుల భాషలో మాట్లాడుతున్నట్టు
చల్లగా, నెమ్మదిగా, ఉల్లాసంగా

'మళ్ళీ ఇంత ప్రేమించేవాడిగానా' అడిగింది
'ప్రేమలోకి ఒకసారి మేలుకొంటే మళ్ళీ అవసరం లేదు
మెలకువ రాకపోయివుంటే మళ్ళీకి అర్థమూ లేదు'

'వేదనామయ లోకంపై దయ చూపేవాడిలానా' అన్నది
'మనకి దయ చూపే అనుభవం కోసం
లోకంలో వేదన ఉండాలనుకోవటం కటువుగా లేదా'

'పోనీ స్వాప్నికుడిలానో, గాయకుడిలానో..'
'లేదు, జీవితాన్ని ఉన్నట్టుగా చూడనివ్వని
మత్తులో మునగటం కాసేపు బావుంటుంది
తరువాత మరింత దిగులు కమ్ముతుంది'

'ఎలా పుడదామని వుంది మరి'
'నిజం చెప్పాలంటే పుట్టాలని లేదు
ఈ కోరిక వలన పుట్టాల్సివస్తుందేమో తెలీదు'

'పుట్టుక నా చేతుల్లో ఉంటే
మరీ కొంచెంసేపు కనిపించి మాయమయే
ఇంద్రధనువై పుట్టాలని ఉంది'

పడమటి కాంతిలో పలుచనినీటి తెరల్లో
ఏడురంగులు తెరుచుకున్నాయి
నేల నుండి నింగికి, నింగి నుండి నేలకి

తెరుచుకున్నచోటికి వెళ్ళి చూడబోతే
ఇంద్రధనువు కనిపించదు
నేను ఇంద్రధనువైనా అంతే

ఇంతకూ, నేను తెరుచుకున్నచోటికి వెళ్ళి
నన్ను చూడగలనా ఎప్పటికైనా..

10.9.2021 7.24 రాత్రి
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 25.10.2021
కవిత 2021

# తెలుసా!

నీ భుజం మీదుగా ఎగురుతూ వెళ్లిన సీతాకోక
ఎక్కడికి వెళుతోందో తెలుసా
దాని జ్ఞాపకం ఎగురుతోన్న ఈ క్షణంలో
ఏ పూల చుట్టూ తిరుగుతుందో ఊహించగలవా

గదిలోకి వచ్చాక
బయట మొక్కలకుండీపై వాలిన ఎండ
ఆకులతో ఇంకా ఎంతసేపు సంభాషిస్తుందో తెలుసా
ఎండ సీతాకోకలా ఎగిరిపోయాక, ఆకుల కింది నీడల్లో
యే కానరాని లోకాలు తెరుచుకుంటాయో ఊహించగలవా

నీ కళ్ళముందు బడిపిల్లల్లా కుదురుగా
ఆకాశంలో కూర్చున్న నక్షత్రాలు
కనురెప్పలు మూసిన క్షణంలో
ఎంత అల్లరి చేసి వుంటాయో,
గబగబా చెదిరి, మళ్లీ కుదురులోకి వచ్చి ఉంటాయో
తెలుసుకోగలవా, పోనీ, ఊహించగలవా

ఈ లోకంలోకి రాకముందు
కాలం నిన్ను తెరిచింది ఏ యుగంలోనో తెలుసుకోగలవా
దీని నుండి వెళ్ళిపోయాక
ఆకాశం నిన్ను దాచేది ఏ తలంలోనో ఊహించగలవా

అనంతమైన కొలతలతో
అలల్లా ఎగసిపడే సృష్టి ఇది

దీనిలోకి వెలుతురు పుట్టినట్టు పుట్టి
చీకటి పుట్టినట్టు వెళ్ళిపోతావు
లేదా, నీలో ఇది చీకటి పుట్టినట్టు పుట్టి
వెలుతురు పుట్టినట్టు వెళ్ళిపోతుంది

వెలుగునీడల మసకచీకట్ల మాయాజాలంలో
నిజంగా ఉన్నదేమిటో, నిజంగా లేనిదేమిటో
నిజం కాకున్నా ఉండీ, లేనట్లున్నదేమిటో
ఎప్పటికైనా తెలుసుకోగలవా, ఊహించగలవా

8.11.2020 12.15 మధ్యాహ్నం
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 22.3.2021

# ఎలా..

1
నీ ప్రక్కనున్న గోడలని చూడు
గోడలపై ఎగురుతున్న నీరెండనీ,
నీరెండలో ఎగురుతున్న దృశ్యాలనీ చూడు
దృశ్యాలలోంచి ఎగురుతున్న జీవితాన్ని చూడు
జీవితంలోకి ఎగురుతున్న నీ ఉనికిని చూడు

2
అవును, ఏమీ మిగలవు
ఈ గోడా, నీరెండా, దృశ్యమూ
ఎలా వచ్చినవి అలానే వెళ్లిపోతాయి
ఈ జీవితమూ, నీ ఉనికీ
ఎలా ఎగసినవి అలానే లయిస్తాయి
రాత్రికి రానున్న నక్షత్రాలూ,
నక్షత్రాలని గాఢంగా హత్తుకొనే చీకటీ కూడా
కాలాంతరంలో కాలగర్భంలో లయిస్తాయి

బహుశా, ఒకనాటికి కాలమూ లయిస్తుంది

3
ప్రేమించాలని వచ్చావా, కోపించాలనా
గర్వించాలని వచ్చావా, దుఃఖించాలనా
నువ్వు వచ్చావా,
ఏవో ఉద్వేగాలు నువ్వుగా వచ్చాయా

త్వరపడకు, జ్వరపడకు
అడవిలో పూవు రాలినట్లు
రాత్రిలోకి ఈ సంధ్య రాలినట్లు
సమయం వచ్చినపుడు
అవీ, నువ్వూ కూడా రాలిపోతాయి

4

రెండే ప్రశ్నల చుట్టూ జీవితమంతా
వలయాలు వలయాలుగా తిరిగావు
ఆమె ఎవరు, ఇదంతా ఏమిటి
ఎప్పటికీ చేతికందని నీ నీడలాంటి ప్రశ్నలు
ఎప్పటికీ దాహం తీర్చని మరీచికల్లాంటి ప్రశ్నలు

తట్టకు, తెరుచుకుంటుందని వారు చెప్పి, వెళ్ళారా
వింటావు కానీ, వినవు
ఎదురుచూడకపోవటం చాతనయే కాలం కోసం
ఎదురుచూస్తూనే వుంటావు

5

ఒక నేను వేల నేనులు ఎందుకయింది
వేల దుఃఖాల వెనుకనున్న ఒకే ఆనందం ఎలా తెలుస్తుంది
'ఎలా..' తరువాత ఎప్పటిలానే
తెరలు తెరలుగా దుఃఖపు వాన..

11.7.2019 7.00 రాత్రి
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 9.9.2019
కవిత్వం 2019

# ఏ తలుపులు

ఎటు నుండి జీవితపు తలుపులు తెరిచి
ఇక్కడికి వచ్చావు నువ్వు
ఏ ఆసక్తి నీ చుట్టూ ఇంత ప్రపంచాన్ని పరిచింది

వెనుతిరిగి వెళ్ళే దారి మరిచిన
నీ కలలోని నీలా ఒకటే బెంగతో
నీ దేహం గాలిపటంలా ఊగుతుంది

తూర్పురేఖపై మరోసారి వెలుతురు మ్రోగుతుంది
నిద్రలే, త్వరత్వరగా జీవించుదామని
నీ చుట్టూ మనుషులు తొందరపెడతారు
ఆలోచనల సాలెగూళ్ల లోంచి
ముఖాలు బయటపెట్టి పలకరిస్తారు
నవ్వు ఒకటుందని గుర్తు చేసుకొని ప్రదర్శిస్తారు

తేదీలూ, వారాలూ, కాలెండర్లూ మారాయి ఇలానే
ఇదంతా ఏమిటని దిగాలుగా అడుగుతావు మరోసారి
దుప్పటి మడతపెడుతూ అంటావు
అసలిదంతా ఎలా మొదలైందని

ఆ ఎగురుతున్న సీతాకోక
ఎటునించి నీ జీవితంలోకి తలుపులు తెరిచింది
ఈ పచ్చదనంపై మెరిసే మంచుబిందువు
ఎందుకని ఈ పూట పలకరించింది

వాటిలోకి మాయమయే క్షణాల్లో
నీ జీవితానికి ఏ చల్లని చేతులు లేపనం పూస్తున్నాయి

అంతంలేని దిగులు, అంతంలేని అందం
అంతంలేని ప్రేమా, అనాసక్తీ

నీపైన కదిలే వెలుగునీడల ఆటలకి అర్థమేమిటి
అర్థాలన్నీ మాయమయ్యే అగాథమైన నిశ్శబ్దంలోకి
ఏ తలుపులు తెరవాలి, లేదా, మూయాలి

25.12.2020 7.40 రాత్రి
ఫండే, సాక్షి దినపత్రిక 21.3.2021
కవిత్వం 2021

# నట్టనడిమి

దృశ్యాలలో కరిగిపోతున్న దృశ్యాలు
శబ్దాలలో లీనమౌతున్న శబ్దాలు

మనుషులలోకి జారిపోతున్న మనుషులు
జీవితాలలో లయిస్తున్న జీవితాలు

వీటికి మొదలేది, చివరేది

ఎండావానలు కలిస్తే పుట్టిన ఇంద్రధనువులా
స్థలకాలాలు కలిస్తే పుట్టిన విశ్వమిది

తుదిమొదలు తెలియని శూన్యంలో
తెగిన గాలిపటంలా ఊగుతున్న జీవితమిది

దీనిలోకి పుట్టకముందు పుట్టిందెక్కడ
దీనిలోంచి వెళ్ళిపోయాక వెళ్ళిపోయేదెప్పుడు

8.7.2020 1.30 మధ్యాహ్నం

# ఆ దిగులు

ఉత్సవమైపోయాక కమ్ముకున్న ఖాళీలా
ప్రియమైన వ్యక్తి వెళ్ళిపోయాక ఆవరించిన దిగులులా
సూర్యుడు వెళ్ళిపోయాక చీకటి ముసురుకొంది

వెలితి లోపల వెలుగుతున్న జ్ఞాపకాలలా
ఒకటొకటిగా దీపాలు వెలుగుతున్నాయి

ఒకటే పగలు, ఒకటే రాత్రి
అనేక మార్లు అనుభవించావు
ఒకటే సంతోషాన్నీ, ఒకటే దిగుల్నీ
అనేక మార్లు తట్టిలేపావు

ఒక్కరోజు గడిపి వెళ్లిపోతే చాలదా ఇక్కడ
అనుకొంటావు చాలాసార్లు
మరల మరల ముఖాలు మార్చుకొని ఎదురౌతున్న
అవే అనుభవాలని తలపోస్తూ

విశాలత్వమేదో నిన్ను పిలుస్తున్నట్టుంటుంది
వెలిసిపోయిన దృశ్యాల్లోంచీ, శబ్దాల్లోంచీ,
దుమ్ముపట్టిన బంధాల్లోంచీ బయటికి రమ్మని

ఇక చాలు అనటం మినహా
దీనిలోంచి బయటికి నడిచే మార్గం తోచదు

ముగుస్తాయి ఒకనాడు ఖచ్చితంగా
నీ మెలకువలూ, కలలూ, గాఢనిద్రలూ

ఈ ఒక్క హామీనీ తలచుకొంటూ
బెంగటిలిన ప్రవాసిలా, ఎప్పటిలానే ఈ రాత్రి కూడా
తెలియరానిచోట ఈ లోకంతో పాటు తలదాచుకుంటావు

6.11.2020 7.30 రాత్రి

# ఉత్సాహానికి దూరంగా

ఉన్నట్లుండి నీ ఉత్సాహం జారిపోతుంది
పూలలోని రంగులు జారిపోయినట్టు
ఇంద్రధనువులోని కాంతి మాయమైనట్లు
మధురమైన భావనేదో మరపులోకి కృంగినట్లు

ఉన్నట్లుండి లోకం చేతులు విడిచి
ఏకాంతంలోకి వెళ్ళిపోవాలనిపిస్తుంది
మెలకువలోనే నిద్రపోతున్నంత
ఖాళీగా ఉండిపోవాలనిపిస్తుంది

వాన చివరి చెమ్మగాలివంటి నిర్వేదం,
మిణుగురు చుట్టూ ముసిరిన రాత్రిలాంటి నిరాశ,

దేనినీ మొదలు పెట్టనీయని, ముగించనీయని
వెలిగీ, వెలగని దీపంలాంటి ఒంటరితనం
నిన్ను నీ ప్రక్కన లాలనగా కూర్చోబెడతాయి

నీకు నువ్వే స్నేహితుడివి, ప్రియురాలివి అప్పుడు
నీ స్పర్శ పూలరేకుల్లా సున్నితమైపోతుంది

రేకుల మీది ఉదయపు కాంతిలా, గాలిలా
లాలనగా నిన్ను తాకబోతున్న
ప్రపంచానికి ఎడంగా జరుగుతుంటావు

బహుశా, అప్పుడు
బిడ్డ కోపగించిన తల్లిని దూరం నుండి చూస్తున్నట్టు
జీవితం దూరంగా నిలిచి నిన్ను చూస్తూ వుంటుంది

20.11.2020 1.40 మధ్యాహ్నం
ఈ మాట మార్చి 2021

# మరొక రాత్రిలోకి

ఉదయాలు ఆకాశంలోకి ఎగురుతాయి
నక్షత్రాల గింజలు ముక్కున కరుస్తూ
వెలుగురెక్కలు విప్పి నిన్ను కప్పుతాయి

పగళ్ళు పంచవర్ణాల మరీచికల్ని పరిచి
ఇన్నాళ్ళూ తెలియని రహస్యమేదో ఇవాళ తెలియనుందని
ఊరికే దోబూచులాడతాయి

నీ వెదుకులాటలోనే నిన్ను దాచి
కాలసర్పం రహస్యంలోకి  చరచరా ప్రాకిపోతుంది

ముసురుకొంటాయి తలచుట్టూ సాయంత్రాలు
'ఇవాళేం చేసావో చెప్పమ'ని
పిల్లల్లాంటి నక్షత్రాలై నీ చుట్టూ కమ్ముకొంటాయి

'నా పనులన్నీ పగటికి వ్రేలాడే నీడల్లాంటివి
చీకటిలో వాటికి ఏ విలువాలేద'ని
ఎప్పటి నీ జవాబునే నీకు చెప్పి
ఒంటరిరాత్రిలోకి విడిచి వెళ్ళిపోతాయి

'వజ్రపుశిలలాంటి ఆకాశాన్ని చిట్లించుకొని
వెళ్ళిపోలేవా ఏమీ లేకపోవటంలో క'ని
మరోసారి నీలో నువ్వే గొణుగుకొంటావు

కన్నీటిబిందు వొకటి భూగోళపు పాపాయిలా
చీకటి చెక్కిళ్ళపై జారిపోతుంది
ఇక చాలు అంటావు, ఊరికే నవ్వుతావు

నీ నవ్వులో కనులు తెరుస్తున్న విశాలవిశ్వమొకటి
'నాన్నా, జీవితం దేవుడి చిరునవ్వు'ని ఊరడిస్తుంది

6.5.2016 8.26 రాత్రి
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 10.10.2016
కవిత 2016

# నీ దుఃఖమంతా

నీ దుఃఖమంతా
నీకు నువ్వు తెలియకపోవటంలో వుంది
తెలియకపోవటమే తెలుసనుకోవటంలో ఉంది

నీ దుఃఖమంతా
ప్రపంచాన్ని అనుభవించటంలో వుంది
అనుభవమంటే తెలియకపోయినా
అనుభవమే గమ్యమని నమ్మటంలో ఉంది

నీ దుఃఖమంతా
నీ చుట్టూ కమ్ముకొన్న విశ్వంలో ఉంది
విశ్వమంటే తెలియకపోయినా
దానికి భయపడుతూ
దానినే గాఢంగా హత్తుకోవటంలో ఉంది

నీ దుఃఖమంతా
విశ్వంలోని చీకటిలో,
చీకటిలోని విశ్వంలో వుంది
చీకటితెర చిరుగుల్లాంటి
కాంతిని అనంతమనుకోవటంలో వుంది

నీ దుఃఖమంతా
ఊరకనే ఊహించుకొన్న చీకటిలో ఉంది
ఎప్పుడూ లేని చీకటిని
ఎల్లప్పుడూ విదిలించుకోవటంలో వుంది

31.7.2020 12.00 మధ్యాహ్నం

# పుట్టుక

పుట్టాలనుకొన్నాక పుట్టలేదు నువ్వు
ఎలాగో జరిగిందది
ఎండ రాగానే రంగులు వచ్చినట్టు
పిట్టలకూతలు గాలిలోకి వాలినట్టు
అలల అంచున వజ్రాలు మెరిసినట్టు

మొదలే నీ సంకల్పం లేనప్పుడు
తరువాతి ఊహల పాత్ర ఏమిటి

మొదలు లేనిచోట మొదలై
ఎవరో విసిరిన రాయిలాగా
చివరలేని చోటికి వెళతావు

ఎండలూ, చీకట్లూ, వెన్నెలలూ
త్వరత్వరగా వాలుతూ, మాయమౌతుంటే
పుట్టుక నుండి మరణానికి
రాయిలాగా దూసుకుపోతుంటావు

చాలా తలుస్తావు, కలగంటావు
వ్యాఖ్యానిస్తావు, వర్ణిస్తావు
నీ చుట్టూ వున్న ఖాళీ గురించి
ఖాళీబొమ్మల గురించి, చేతల గురించి

కాలం నీ ఊహల కందని ఒంపులు తిరిగాక
కాసిని ఖాళీ కన్నీళ్ళనీ, చిరునవ్వుల్నీ విడిచాక
వెలుపలా, లోపలా ఒకటైన ఖాళీలోకి
చివరిమలుపులో నిన్ను వదిలేసుకుంటావు

11.2.2021 12.21 మధ్యాహ్నం

# ఒక సంభాషణ

ఏది నిన్ను గాయపరిచింది
ఏది భయంలో ముంచింది అన్నాడు మిత్రుడు
చీకటిలో వెలుతురూ
వెలుతురులో చీకటీ పొడిపొడిగా రాలుతున్న రాత్రివేళ

పూవు పూయటానికి రోజంతా పడుతుంది
రాలటానికి క్షణం చాలు
ఇదీ ప్రపంచం అని అర్థమవుతున్నపుడు
గాయపడటం, భయపడటం మొదలైంది అన్నాను

నువు చాలా సున్నితం
అయినా దీని నొక ద్వారంలా చూడు
ఈ గాయమే లేకపోతే ప్రపంచాన్ని దాటే దారి వెదకవు

నీ చూపు చాలా పరిమితం కూడా
పూవు నువు చూసినపుడు పుట్టలేదు
చూస్తుండగా రాలలేదు

అది ఎప్పుడు పుట్టిందో
మనకు నిజంగా తెలీదు
భూమి పుట్టినపుడో, సృష్టి పుట్టినపుడో
పూవు పుట్టడం మొదలైంది

ఏ మహాశూన్యంలో పుట్టిందో
ఏ మహాశూన్యంలో లయిస్తుందో
పూవుకే తెలియదు
పూవుని చూసే చూపుకీ తెలియదు
చూపుని చూసే తెలివికీ తెలియదు

తెలియకపోవటంలోకి వెళ్ళటానికి
తెలిసినదానిలో పలు ద్వారాలు ఇవి

ఊరికే చూడు రాత్రినీ, నక్షత్రాలనీ,
దుఃఖాలనీ, ఈ మాటల్నీ
వెలుగు, చీకటుల యుగాల ప్రణయంతో
మేలుకో, కలగను, నిద్రపో

అల లలలుగా ఏం చేస్తున్నా
లోలోపల ఊరికే ఉండటమొక మహాద్వారం

మిత్రుడు పదాలతో తెరిచిన పలు ఖాళీల్లోకి
నువ్వూ, మిత్రుడూ
రాత్రీ, చీకటీ, వెలుతురూ ప్రవేశించగా
ఏమీ తోచని కాలమూ
వాటి వెనుకే ఖాళీలోకి చేరిపోయింది

13.11.2020 4.00 సాయంత్రం
పాలపిట్ట ఫిబ్రవరి 2021

# ఊరికే జీవించటం

పాత్ర నుండి బంగారాన్నీ
కుండ నుండి మట్టినీ వేరు చేసినట్టు
అనుభవాల నుండి జీవించటాన్ని వేరు చేయాలి

శబ్దాల నుండి నిశ్శబ్దాన్నీ
దృశ్యాల నుండి శూన్యాన్నీ
మాటల నుండి మౌనాన్నీ
పనుల నుండి ఖాళీనీ
బంధాల నుండి ఏకాంతాన్నీ కూడా..

నీటిపై సూర్యకాంతి వజ్రంలా మెరిసినట్టు
తెలియని అనంతంపై కాలం మెరుస్తోంది
ఊహకందని చీకటిపై లోకం మెరుస్తోంది

జీవించటం తప్ప ఏమీ చేయలేము ఇక్కడ
బహుశా, చేయనవసరం లేదు

ప్రవాహంలోని ఎండుపుల్లలా,
గాలిలోని ఎండుటాకులా
ఎండిపోయిన మనస్సు ఒకటి
కాలంలోకి రాలిపోవటం చూస్తాము

కన్నీరు కూడా రాలుతుంది
అది ఎక్కడ పుట్టిందో తెలియదు

గతంలాంటి మహాలోయలోనో
భవితలాంటి శూన్యశిఖరం మీదనో
కన్నీరు పుడుతుంది, చిరునవ్వూ అక్కడే రాలుతుంది

చేయగలిగిందేమీ లేదు
ఊరికే జీవించటం మినహా

గదిలో వైద్యులు ప్రేమాస్పదమైన మనిషి చుట్టూ చేరి
తిరిగి రమ్మని బ్రతిమాలుతున్నపుడు
వారి సంజ్ఞ కోసం కళ్ళలో ప్రాణంతో చూసినట్టు

ఆతృతగా, ప్రాణావసరంగా
జీవితమేమిటని ప్రశ్నించుకొన్నపుడు

అకస్మాత్తుగా పాత్ర నుండి బంగారమూ
కుండ నుండి మట్టీ,
జీవితం నుండి మృత్యువూ విడిపోతాయి

అప్పుడిక చేయవలసిందేమీ మిగలదు
ఊరికే జీవించిపెట్టడం మినహా..

5.11.2020 12.00 మధ్యాహ్నం

# దూకాలి

ఏటిగట్టు నుండి నదిలోకి దూకినట్లు
శిఖరం పైనుండి లోయలోకి దూకినట్లు

మెలకువ నుండి నిద్రలోకి దూకినట్లు
జీవితం నుండి మృత్యువులోకి దూకినట్లు

తెలియటం నుండి తెలియకపోవటంలోకి దూకాలి
ఏదో ఒకటి కావటం నుండి ఏదీ కాకపోవటంలోకీ,

ఏదో ఒకటి చేయటం నుండి ఏమీ చేయకపోవటంలోకీ,
అనుభవించటం నుండి అనుభవించబడటంలోకీ దూకాలి

అప్పుడు అకస్మాత్తుగా
చీకటి గుడ్డు చిట్లి వెలుతురు పక్షి ఎగిరినట్టు
జీవితం కల చిట్లి శాంతి లోకి ఎగురుతావు

11.9.2022 2.00 మధ్యాహ్నం

# సాధన

ప్రత్యేకంగా చేసేదేం లేదు
ఇప్పుడేం చేస్తున్నావో అవే చెయ్యాలి
ఎలా చేస్తున్నావో అలానే

తిను, తిరుగు, నిద్రపో
తప్పులు చెయ్యి, చెయ్యనియ్యి
తిట్టుకో నిన్నూ, ఇతరుల్నీ

సగం సగం పనులు చెయ్యి
లేదా పూర్తిగా మానెయ్యి
లేదా పూర్తి చెయ్యి

తెలివితక్కువగా ఉండు
లేదా అతితెలివి చూపించు
ఊరికే దయగా ఉండాలనిపిస్తే ఉండు

ప్రత్యేకం ఏమీ చేసేది లేదు
ఏం చేస్తున్నా, నిన్ను నువ్వే
దారినపోయే మనిషిలా చూస్తే చాలు

చూడగలిగితే చూడు
లేకపోతే మానెయ్యి
చూసినా, చూడకపోయినా
ఉన్నది పోదు, లేనిది రాదు

జీవితం ఉందనిపిస్తే
చేతులు చాపి దగ్గరకు తీసుకొని అనుభవించు,
జీవితం ఏమిటనిపిస్తే
దాని భుజంపై చేయి వేసి నిశ్శబ్దంగా కూర్చో,
జీవితం లేదనిపిస్తే ఊరికే ఖాళీగా వుండు

చూడు
పక్షులు ఎగురుతున్నాయి
సూర్యుడు వాలుతున్నాడు
తూర్పు ఆకాశంలో కాసేపటికి
చంద్రోదయం కాబోతోంది

2.8.2020 11.50 ఉదయం

# చివరి ప్రశ్న

బాల్యం :
పైన మెరిసే నక్షత్రాలు
నేలంతా చీకటి
పైన నడిచే సూర్యబింబం
నేలంతా వెలుగునీడలు

యవ్వనం :
నక్షత్రాలని మూసిన కోరికలు
చీకటిని కప్పిన కలలు

నడివయసు :
సూర్యునితో పరుగుపెట్టిన బాధ్యతలు
వెలుగునీడల్లో చిక్కిన బంధాలు

వృద్ధాప్యం :
వెలిసిపోతున్న నక్షత్రాలు
వాలిపోతున్న సూర్యబింబాలు

చీకటిలోకి రాలిపోతున్న
చివరి వెలుగునీడల్ని చూస్తూ
అతను  అనుకుంటున్నాడు

'జీవితం పంపిన ఈ ప్రేమలేఖల్ని
ఎప్పుడైనా తెరచి చదువుకొన్నానా..'

5.2.2021 5.25 సాయంత్రం

# కలువరేకులా..

కాలమూ, ఆకాశమూ
రెండు సున్నితమైన చేతులు
తెరుస్తూ ఉన్నాయి
కలువరేకుల్ని సుతారంగా

తీరికగా, బహు తేలికగా
విప్పుతున్నాయి రేకుల్ని
అంతకంటే పనేమీ లేనట్టు
సృష్టికి అర్థమే లేనట్టు
శ్రద్ధగా, నిండుగా

తమను తామే విప్పుకొంటున్నాయి
కలువరేకులలోంచి
కాలమూ, ఆకాశమూ

వాటితో జత చేయవచ్చు
చూడకుండా సాగిపోనూ వచ్చు
వాటిని తాకాలంటే
వాటి కోమలత్వం వరకూ
అనువదించుకోవాలి మనల్ని

అప్పుడు గానీ
విచ్చుకొనే కాలంలోకి ప్రయాణించలేము
వికసించటమనే రహస్యంలోకి ప్రవేశించలేము

3.9.2020 11.45 ఉదయం
పున్నమి 7.2.2021

# ఆగి చూడు

ఆగి చూడు ఈ పూవుని,
పూవులోంచి తెరుచుకొనే రంగుల్ని,
రంగుల్ని పసిపిల్లల్లా మోసే పూలరేకుల్ని,
రేకుల చుట్టూ గిరికీలు కొట్టే సూర్యకాంతిని,

సూర్యకాంతిలో
తేలే జగత్తుని, మునిగే జీవితాలని

పనిలోనో, ప్రయాణంలోనో, పరాకులోనో
మునిగే ముందో, తేలే ముందో
ఊరికే ఆగి చూడు

మారే రేఖల్ని, రంగుల్ని, వెలుగునీడల్ని
మారీ, మారని బొమ్మల్ని

నీ చుట్టూ పసిపిల్లల్లా నిలిచిన
దృశ్యాల్ని, శబ్దాల్ని, స్పర్శల్ని

ఊరికే ఆగి, ఊరికే చూడు
కాసేపు జీవితాన్ని,
నువ్వు జీవించటాన్ని

18.10.2020 3.50 మధ్యాహ్నం

# చూసావా

'నన్ను చూసావా'లో ఇరుక్కోకు
జీవితం బావుంటుంది అన్నాడతను

పూవుని పూవుకన్నా కోమలంగా
తాకటానికి ప్రయత్నిస్తూ

'నేను చూసాను'లో కూడానా అన్నాను
గాలికి ఊగుతున్న
పూవు నీడలోకి తప్పిపోవటానికి చూస్తూ

'రహస్యం తెలిసింది నీకు' అన్నాడు
నీలాకాశపు తెర వెనుకకు తప్పుకొంటూ

'ఎండ కాసేటపుడు అన్నీ తెరుచుకుంటాయి
చీకటితో సహా' అన్నాను

కీచురాయి పాట ఎత్తుకుంది
కాలం దానిలోకి జలపాతంలా దూకింది

24.8.2020 1.30 మధ్యాహ్నం
ఈ మాట ఫిబ్రవరి 2021

# చీకట్లో నాట్యం

కారుచీకట్లోని నాట్యానికి
ప్రేక్షకులెవరూ లేనట్లు
ఇక్కడ జీవించి వెళ్ళటాన్ని
చూసేవాళ్ళెవరూ లేరు

మోయలేనంత వెలుతురు
ఉదయాల్లో ఎవరో క్రుమ్మరిస్తున్నారనీ,
దాచుకున్న చీకట్లని
అడగకుండానే పట్టుకుపోతున్నారనీ,
వెలుతురు బందీనై బ్రతకటమెందుకనీ

ఊరికే తల్లడిల్లకు
ఊరటకోరి ప్రతి హృదయాన్నీ తట్టకు

ఈ వెలుతురు ఉత్త చీకటి
ఈ జీవితం ఎవరూ చూడని నాట్యం
తుదిమొదలు లేని చీకటిలో
మొదలైనా కాని నాట్యం నీ జీవితం

మరణించినంత హాయిగా
జీవించే వీలున్న చోటిది

ఇప్పుడు చెప్పు చూద్దాం
మన మీ వీధి మలుపు తిరిగే లోపు
ఎన్ని లోకాలు పుట్టి చనిపోతాయో

22.9.2020 8.00 రాత్రి

# అప్పటివరకూ..

నీ ప్రయత్నం నీటిమీద గీతలాంటిది
ఆకాశంపై పక్షి ముద్రలాంటిది
గాలిలోకి రాలిపోయిన మాటలాంటిది

చాలా తలపెడతాం బాధ్యతల్లాంటివి
వాటిలోకి దిగక ముందు,
కొబ్బరిచెట్ల ఆకులు గాలికి కదులుతాయి
చందమామ మెల్లగా, రావచ్చా నీలోకి అంటుంది

వాటిలోంచి బయటపడ్డాక కూడా
అవే కొబ్బరాకులు, అదే చందమామ

జీవితం వెడల్పైన అనుభవం కాదు
లోతైన మునక
ఈ క్షణంలోకి, నువ్వున్న స్థలంలోకి

అనేక కోరికలు, భయాలు
శ్వాసల్లా, చెట్ల ఆకుల్లా
పుడుతూ, రాలిపోతూ నీ ముందు

ఉన్నట్టుండి నీలోంచి ఎవరో అంటారు
ఏమీలేదు అని
బిడ్డ పీడకలలోకి తల్లి అన్నట్టు

అనేక ఉండటాలు
ఏకైక ఏమీలేదు లోకి
వలయాలు తిరుగుతూ జారిపోతాయి

అప్పటి వరకూ
ఇదిగో కాస్త టీ తాగు..

20.9.2020 11.40 ఉదయం

# తెరవరానివి

మూత తెరిచినట్టు దృశ్యాన్ని తెరుస్తావు
దృశ్యం లోపలి శూన్యం
కంటి ముందు వాలుతుంది

మూత తెరిచినట్టు పదాన్ని తెరుస్తావు
పదం లోపలి నిశ్శబ్దం
మనసు ముందు వాలుతుంది

మూత తెరిచినట్టు జీవితాన్ని తెరుస్తావు
జీవితం లోపలి అనంతం
నేను ముందు వాలుతుంది

శూన్యాన్ని తెరవాలని చూడకు
ఇక చూడలేవు

నిశ్శబ్దాన్ని తెరవాలని చూడకు
ఇక మాట్లాడలేవు

అనంతాన్ని తెరవాలని చూడకు
ఇక మిగలవు

18.10.2020 3.30 మధ్యాహ్నం

# అనంతంలోకి..

అనంతంలోకి ప్రవేశించాక
వెనుతిరిగే వీలు లేకుండా
తలుపులు మూసెయ్యాలి

అప్పుడుగానీ నీ కర్థం కాదు
తలుపులనేవి ఎప్పుడూ లేవని

కనుక మూయటమూ లేదని
వెనుతిరగటానికి స్థలమే లేదని

ప్రవేశించటమే లేదు గనుక
అనంతమూ లేదని, అంతమూ లేదని

అవునూ, అర్థమంటే ఏమిటి
నువ్వంటే ఏమిటి

7.8.2020 11.20 ఉదయం
సారంగ 15.2.2021

# ఆట

అందమైన అనుభవాలూ, అందుకొన్న సౌఖ్యాలూ
నీ ప్రయోజకత్వ ఫలితమనీ,
ఊహించలేని ఖాళీల్లో జీవితం పరిచిన చేదు అంతా
విధి వైపరీత్యమనీ, వ్యవస్థ అవలక్షణమనీ అనుకొంటావు గానీ

ఏదీ నీ చేతుల్లో లేదనో,
అన్నీ నీ చేతుల్లోనివే అనో
ఎప్పటికీ అనుకోలేవు

అటు కొన్నీ, ఇటు కొన్నీ అనుకోవటంలోనే
ఆట అంతా దాగి వుందని కలనైనా తలవలేవు

ఇలాంటి లోకంలో ఎందుకు పుట్టాలనో,
ఇలాంటి నువ్వు ఎందుకు పుట్టాలనో,
ఇలాంటి లోకమూ, ఇలాంటి పుట్టుకా
ఎందుకు జరగాలనో

నిన్నో, లోకాన్నో, పుట్టుకనో
గాయం మీది కట్టులా తీసేయాలని చూస్తావు గానీ

లోకం మాత్రమే వుందనో,
నువ్వు మాత్రమే ఉన్నావనో,
పుట్టుక మాత్రమే వుందనో గ్రహించి
క్షణమైనా స్థిమితంగా ఉన్నచోట ఉండలేవు

లోకం నిండా స్థలకాలాలు పరిచిన వలకి
అనేక కొలతలు, కోణాలు, తలాలు

తెలియని ఆటగాడెవరో
ఎప్పుడు, ఎక్కడ, ఎలా నిన్ను
ఉంచాలో, పెంచాలో, తగ్గించాలో సరిచూస్తూ
చిరునవ్వుతో తన ఆట ఆడతాడు

ఆట ముగించి
అనంతం పెట్టెలో దాచే వరకూ
అతను నిన్ను పట్టుకునే ఉంటాడు

6.11.2020 1.00 మధ్యాహ్నం

# తెలియరాని

నీ కోరికలు నీవి కాదు
ఎక్కడో పుట్టాయి కాలానికి తెలియనిచోట

నీ భయాలు నీవి కాదు
ఎక్కడో పుడతాయి ఏ స్థలమూ లేనిచోట

కోరికలనీ, భయాలనీ వస్త్రాల్లా విప్పి చూస్తే
ఖాళీ నువ్వు కనిపిస్తావు

స్థలకాలాలు ఖాళీ అయిపోయిన
ఉత్త స్వేచ్ఛలాంటి నువ్వు

ఇప్పుడు పూలని చూడు
పూల పైన రంగుల్ని
రంగుల పైన గాలిని
గాలి పైన ఎండని
ఎండ పైన ఆకాశాన్ని
ఆకాశం పైన చూపుని

తెలియరాని అనంతంలో
సృష్టి చినుకులా రాలింది
చినుకు తర్వాత ఏమీలేదు

21.11.2020 10.55 ఉదయం

# నాది

నాది కావాలనో,
నాది కాకుండా పోకూడదనో
శ్వాసల్లో నూటికి తొంభై ఖర్చు చేస్తావు గానీ

నాది అనుకున్నదల్లా
శ్వాసపైన కూర్చోవటం గమనించావా
ఊపిరాడకపోవడం చూసుకున్నావా

అప్పుడప్పుడూ
బహుశా, ఎప్పుడూ
ఊపిరాడని నిన్ను వదిలించుకోవటానికి

వినోదాలూ, విహారాలలోకి
స్నేహాలూ, కబుర్లలోకి
బాధ్యతలూ, సరదాలలోకి
బాధలూ, సందర్భాలలోకి
నీ నుండి తప్పించుకు తిరగటం కనిపెట్టావా

'నాది' ఒక గోడ
దాని కొలతలు అనంతం
దాని ముందు ఆకాశం ఒక పిట్ట

ఈ కథ నిజంగా అర్థమైన క్షణంలో
నువ్వు గోడ మీద ఉంటావు

16.7.2020 12.10 మధ్యాహ్నం
కవిసంధ్య సెప్టెంబర్ 2020

# ఇక ఖాళీగా

పొందటం ఎవరికైనా తెలుస్తుంది
ప్రాణులన్నిటికీ తెలిసినట్టు.,
పోగొట్టుకోవటం తెలియాలి

ఎవరో ఇచ్చినవన్నీ ఎవరో తీసుకోకముందు
నీకన్నా లోభి నిన్ను మించి పొందకముందు
నీకన్నా భయస్థుడు పైచేయి కాకముందు
అడుగులేని పాత్రలా ఖాళీ చేసుకోవటం తెలియాలి

బహుశా, రమ్మనకుండా వచ్చింది
పొమ్మన్నా పోదు
బ్రతిమాలీ, భయపెట్టీ తెచ్చుకున్నది
కన్నుగప్పి మాయం కాకుండా మిగలదు

ఎవడు వచ్చాననుకొన్నాడో
వాడు వెళ్ళితీరతాడు
ఎవడు రానట్లుంటాడో
వాడికి వెళ్ళేందుకు చోటే మిగలదు

కనుక ఖాళీగా ఉండి చూడు
అడుగులేని పాత్రలోంచి
ఆకాశం ఎప్పటికీ జారిపోదు

5.7.2020 12.10 మధ్యాహ్నం

# తరువాత

తరువాత ఏమిటి అంటారెవరో

ఏవీ వినలేదేమో జీవితంలో
ఈ పదాల కన్నా ఎక్కువగా..
మరేవీ అనుకోలేదేమో నీతో నువ్వు

ప్రపంచం పుట్టాక, తరువాత పుట్టలేదు
తరువాత పుట్టాక, ప్రపంచం పుట్టినట్టుంది

వేల తరువాతల తరువాత కూడా
తరువాత కొత్తగానే ఉంటుంది,
తొందరపెడుతూనే వుంటుంది

మూసి వున్న మరుసటి క్షణాన్ని
త్వరగా తెరవమనీ,
కాలం దాచి వుంచిన అనుభవంలోకి దూకమనీ
అది అలసిపోకుండా చెబుతూనే ఉంటుంది

తరువాతలోకి పరుగులు తీసీ, తీసీ
ఎంతదూరం వచ్చానా అని
ఎపుడన్నా వెనుతిరిగి చూస్తావా

గతంలోని తరువాతలన్నీ
ఒకనాడు మెరిసిపోయిన వస్త్రాల్లా
వెలిసిపోయీ, చినిగిపోయీ కనిపిస్తాయి

తరువాత అనే మాయతెర కప్పుకొన్న
జీవన రహస్యమేదో

అటుచూడు, రానున్న క్షణంలోనే
నీ జీవనసార మంతా దాగివుందని
నీ చెవిలో చెబుతూ
దాగుడుమూత లాడుతూనే వుంటుంది

17.7.2020 12.15 మధ్యాహ్నం

# చేపలా

సముద్రంలోని చేప
ఒక్కసారి ఆకాశంలోకి ఎగిరి
మళ్ళీ సముద్రంలో పడినట్టు
ఒక్కొక్కసారి అనంతంలోకి ఎగిరి
మళ్ళీ ప్రపంచంలో పడతావు

గాల్లోకి ఎగిరినపుడు
గాలి అందని చేపలాంటి నువ్వు
ఊపిరిపీల్చే ఆటలో పడి
ఊపిరాడట్లే దంటావు

జీవితావసరా లేవీ వద్దు,
ఉత్త జీవితం కావాలని విలపిస్తావు

కలలో అమ్మ లేక ఏడుస్తున్న
ఒడిలోని బిడ్డని తల్లి తట్టి లేపినట్టు
నిన్నెవరో ఇప్పుడు జీవితంలోకి తట్టిలేపాలి

19.8.2020 11.40 ఉదయం

# ఆకాశమూ - జీవితమూ

1
చినుకుల మధ్య
ఖాళీ ఆకాశం చాలా వున్నా
వాన కురుస్తుందంటాం కానీ
అనవరతమూ కురిసే ఆకాశాన్ని దర్శించం

కన్నీటి చినుకుల మధ్య
ఖాళీ జీవితం చాలా వున్నా
దుఃఖానుభవాలను తలుస్తాం కానీ
అనవరతమూ అనుభవిస్తున్న జీవితానికి మేలుకోం

2
ఏమున్నా లేకపోయినా
తలెత్తి చూస్తే ఆకాశం వున్నట్లు
ఏమున్నా లేకపోయినా
మనలోకి చూస్తే జీవితం వుంటుంది

3
మన చూపులు పక్షులై
ఆకాశానికి ఎగిరినపుడు
మన వెలుపలివన్నీ
ఒకే జీవితంగా దర్శనమిస్తాయి

మన చూపు అద్దమై
లోనికి తిరిగినపుడు
మన లోపలివన్నీ
ఒకే ఆకాశంగా స్ఫురిస్తాయి

ఒకే జీవితం
ఒకే ఆకాశం
ఒకే ఒక కల నుండి
తటాలున మేలుకొలుపుతాయి

8.8.2019 2.00 మధ్యాహ్నం
నవ్య వారపత్రిక 4.9.2019

# ఉన్నపళంగా

చేయబోయే ప్రయాణం కన్నా
తయారయే సమయం ఎక్కువైనట్టు,
గమ్యంలో గడిపే కాలం కన్నా
ప్రయాణం బహు దీర్ఘమైనట్టు

నిండుగా బ్రతికే క్షణాల కన్నా
బ్రతికే ఏర్పాట్లకే కాలం కరిగిపోతోంది

తల్లి ఒడిలో కూర్చుని
తప్పిపోయానని ఏడ్చినట్టు

ఇప్పటిలోని సుఖాన్ని పొందటానికి
ఎప్పటికో ప్రణాళికలు వేస్తాము
ఇక్కడిలోని భద్రత కనుగొనటానికి
ఎక్కడెక్కడికో సంచరిస్తాము

నేను, నువ్వు, తాను
మూడు జీవితాలు
నీకు లేనట్టుగానే ఎవరికీ లేవు

నిన్న, నేడు, రేపు
మూడు కాలాలు
ఇప్పుడుకి లేనట్టే ఎప్పుడూ లేవు

పొడవూ, వెడల్పు, లోతు
మూడు కొలతలు
ఇక్కడకి లేనట్టే ఎక్కడా లేవు

ఉన్నది నువ్వే ఇప్పుడే ఇక్కడే

ఉన్నపళంగా చనిపోయినట్టు
ఉన్నపళంగా జీవించి చూడాలి
ఉన్నపళంగా స్పృహ తప్పినట్టు
ఉన్నపళంగా మెలకువైపోవాలి

8.7.2020 1.00 మధ్యాహ్నం
కౌముది డిసెంబర్ 2020

# అక్కడికి

ఎక్కడా లేని చోటికి
ఎప్పుడూ లేని కాలానికి
ఏదీ లేని అనుభవానికి
నాలుగు ద్వారాలున్నాయి

నేను
ఇప్పుడు
ఇక్కడ
ఇలా

ఏదో ఒక ద్వారంలోంచి
లోనికి వెళ్ళినపుడు
పూర్తిగా వెలుపలికి వెళ్లిపోతావు
కాలం కక్ష్య దాటి అనంతంలోకి

అక్కడ
శబ్దంలేని శబ్దం
స్పర్శలేని స్పర్శ
రూపంలేని రూపం
రుచిలేని రుచి
వాసనలేని వాసన
నీకోసం ఎదురుచూస్తాయి

తెలిసినచోటు నుండి
దానిని మృత్యువంటారు
తెలియనిచోటు నుండి
దానిని జీవితమంటారు

6.7.2020 12.00 మధ్యాహ్నం
ఈమాట అక్టోబర్ 2020

# ఎప్పుడైనా, ఎక్కడైనా..

ఎప్పుడైనా, ఎక్కడైనా
నువ్వు నువ్వు కాకుండా ఉండటానికి
ఒక అవకాశం తెరిచే వుంటుంది

కదలికే లేనిచోట గాలి వీచినట్టు
ఊయలలూగే పూవు తొడిమనుంచి జారినట్టు
నడివేసవి నేలపై వానచినుకు మెరిసినట్టు
ఒక అవకాశం
నీ సందర్భాల చుట్టూ సంచరిస్తూ ఉంటుంది

పనుల మధ్య తటాలున ఏదో గుర్తువచ్చినట్టు
నడిచే నడిచే మనిషి దారిలో వెనుతిరిగినట్టు
మాట్లాడుతున్న మనిషి ఆలోచనలో పడినట్టు
ఎప్పుడైనా ఒక అవకాశం కాచుకొని వుంటుంది

ఎవరో నిన్ను కలలోంచి పిలిచినట్టు
ఎవరో నిన్ను మెలకువలోంచి తట్టినట్టు

ఉన్నట్లుండి
నీ నుండి నువ్వు విడుదల కావటానికి
నువు లేకపోవటంలోకి ఎగిరిపోవటానికి
ఉత్త ఖాళీలోకి మరలిపోయి
నువ్వే ఖాళీగా వికసించటానికి

బహుశా, ఇప్పుడే, ఇక్కడే, ఇలానే
ఒక అవకాశం
నిన్ను నీ అంత దగ్గరగా చుట్టుకొని ఉంటుంది

5.8.2020 12.20 మధ్యాహ్నం
కవితా 2020

# కడపటి ఖాళీ నుండి

వెన్న కరిగి నేయి అయినట్లు,
అంధకారం కరిగి కాంతి అయినట్లు

నీ ఉనికి కరిగి జీవిత మౌతావు
దుఃఖం కరిగి ఆనందానివీ,
భయం కరిగి ప్రేమవీ,
తెలియనిది కరిగి జ్ఞానానివీ అవుతావు

పక్షి ఎగిరిపోయిన ఖాళీలో
పక్షిని కలగన్న ఆకాశం మిగిలే వుంటుంది
పూవు రాలిపోయిన కొమ్మ చివర
పూవుని కలగన్న గాలి వలయాలు తిరుగుతుంది

కల మాయమైన కారు చీకటిని
కలగనేవాడు కౌగలించుకుని నిద్రిస్తాడు

ప్రపంచం చెరిగిపోయిన కడపటిఖాళీని
ఎప్పుడూ, ఎక్కడా లేనిది
ఎన్నడూ విడువక పట్టుకుంటుంది

లేనిదానిని ఉన్నది ప్రేమించినట్లే
ఉన్నదానిని లేనిది పొదువుకొని వుంటుంది

వెలుగూ, చీకటీ అనే పేర్లు తప్ప
ఛాయలు మార్చుకొంటున్న ఆకాశం ఒకటే

ఏవో కాలాల లోపల తడిశాక,
ఏవో దేశాల వెంబడి తడుముకొన్నాక,
వెర్రిగా ఏడ్చాక, నవ్వాక, ఎదురుచూసాక,
నిన్ను నువ్వే లాలనగా ఓదార్చుకొన్నాక

అకస్మాత్తుగా తెలుస్తుంది
ఎప్పుడూ ఇక్కడే, ఇలానే నిండుగా ఉన్నావని

12.12.2020 5.00 సాయంత్రం
సోపతి, నవ తెలంగాణ 14.2.2021

# చీకటివెలుగు

నాకు తెలియదు అన్నావు కదా

వెలుతురు నుండి చీకటిని చూసినట్టు
తెలిసిన నుండి తెలియంది చూస్తున్నావా
చీకటి నుండి వెలుతురుని చూసినట్టు
తెలియని నుండి తెలిసింది చూస్తున్నావా

తెలుసు అంటున్నపుడు
వెలుతురులోంచి వెలుతురు చూస్తావా
చీకటిలోంచి వెలుతురు చూస్తావా

నాకు నేను తెలుసు అన్నప్పుడు
వెలుతురు గర్భంలోని వెలుతురువా
వెలుతురులో దాగలేని చీకటివా

పోనీ,
నాకు నేను తెలియదు అన్నావా
చీకటి గుహలో వెలిగిన దీపానివా
చీకటిలో కరిగిపోతున్న చీకటివా

ఈ పొరలపొరల చీకటివెలుగులకి
మొదలేది, తుదియేది
ఇంతకూ, ఈ ఆట జరుగుతున్న దెక్కడ
చీకటిలోనా, వెలుతురులోనా!!

16.7.2020 11.40 ఉదయం

# అవునా!

అవునకీ, కాదుకీ మధ్య
అనంతలోకాలు పుట్టుకొస్తాయి

గాలి ఎప్పటిలా నిద్రలేచి
ఎండని మేల్కొలుపుతుంది

తలలో మేఘాలు తేలుతుంటాయి
పలుచనివీ, చిక్కటివీ, చిన్నవీ, పెద్దవీ
నలుపూ, తెలుపుల మధ్య
ఊహలుపోయే అనేక రంగులవి

అలవాటైన పనుల్లోకీ
పాడుబడిన అనుభవాల్లోకీ
దేహం ఈదుతుంది

అవుననుకున్నది  కాదేమోనని
లోపలెవరో పసిపిల్లలు పలుకుతారు

క్షణం ఆగుతావు
మేఘాలని విదిలించుకోబోతావు
అలవాట్లు పలకరించి
అలవోకగా తమతో తీసుకుపోతాయి

మేఘాలూ, అనుభవాలూ,
అలవాట్లూ, దేహమూ
అలసిపోతాయి కొత్తగా మరోసారి

చీకటి ఎప్పటిలా నిద్రలోకి వెళుతూ
శబ్దాలని జోకొడుతుంది

కాదుకీ, అవునుకీ మధ్య
అనంతలోకాలు జోగుతాయి

లేనిది ఎప్పటిలా లేకుండాపోతూ
ఉన్నదానిని తనలో లీనం చేసుకుంటుంది

7.3.2021 12.10 మధ్యాహ్నం

# దేవుడిలా

దేవుడు
ఇసుకలో ఆడుకునే బాలుడికన్నా
ఎక్కువ ఆలోచించడు
తన సంతోషం కోసం గూడు కడతాడు
తన సంతోషం కోసం కూలగొడతాడు

అయితే దేవుడు చాలా చురుకైనవాడు
ఒకే క్షణంలో
కడుతూ, కూలగొడుతూ ఉండగలడు

ఈ క్షణానికి
గతం వైపు నిలిచి చూస్తే
కడుతున్న భవిష్యత్తు కనిపిస్తుంది

భవిత వైపు నిలిచి చూస్తే
కూలగొడుతున్న గతం కనిపిస్తుంది

దేవుడికే లేని భారమైన ఆలోచనలు
మనకెందుకు
హాయిగా ఈ క్షణంలో మునకలేయక
అంటాడు ఇతను

23.10.2020 11.00 ఉదయం

# గాలి కదిలినా

గాలికి గుమ్మంతెర కదిలినా
చెట్ల ఆకులు జలజలా రాలినట్టు
నువ్వు కవిత్వమై రాలవచ్చు

గాలి మాత్రమే గాలిలో ఉన్నట్టు,
శబ్దం మాత్రమే శబ్దంలో ఉన్నట్టు,
కదలిక మాత్రమే కదలికలో ఉన్నట్టు

జీవితం మాత్రమే నీలో ఉంటే
గుమ్మంతెర కదిలినా తెరలుగా స్పందించవచ్చు

మరేమీ కాని జీవితానివి అయినప్పుడు,
స్వేచ్ఛవి అయినప్పుడు,
వెర్రిబాగుల ఆనందానివై మిగిలినప్పుడు

గుమ్మంతెరలా గాలి కదిలినా
నువ్వు బోలెడు ఆశ్చర్యానివి కావచ్చు
క్షణాన్ని చిట్లించుకొని కాంతిలోకి ఎగిరిపోవచ్చు

19.08.2016 11.11 ఉదయం
నవ్య వారపత్రిక 2.12.2017

# ఈ క్షణం

ఈ క్షణమొకసారి పిల్లకాలువ
తేలికగా ప్రవహిస్తూ పోతుంది
ఒక్క గెంతులో దాటగలుగుతావు

మరొకసారి మహాసముద్రం
దానిలో మునిగిపోకుండా నిలబడటానికి
శక్తులన్నీ ఒడ్డుతావు

ఒకసారొక చినుకు
గుర్తించేలోపు పలకరించి మాయమౌతుంది

మరొకసారి మురికికూపం
తప్పుకొని పోయేందుకు తహతహలాడతావు

అనేక క్షణాలుగా కనబడే ఒకే ఒక క్షణం ఇది
దానిని అనుభవిస్తున్నట్లుంటుంది గానీ

అదే నిన్నూ, నన్నూ, లోకాన్నీ
అనుభవిస్తూ, పలవరిస్తూ చలిస్తోంది

క్షణాన్ని ఊరకనే పైపైన తాకి
అది పూవులాంటిదనో, పండులాంటిదనో
రంగులు రాల్చిన ఎండుటాకులాంటిదనో

తేలికగా తలుస్తావు గానీ
దాని గర్భంలో ఏముందో పసిగట్టలేవు

క్షణం గర్భంలో అనంత విశ్వాలున్నాయి
అంతూదరీ లేని లోతులున్నాయి
మొనదేలిన తర్కాలకూ అందని కొలతలున్నాయి

తెలియరాని ఆకర్షణ ఏదో
దాని ఖాళీ రంగు సుడిగుండంలోకి
బలంగా లాగేటప్పుడు జాగ్రత్త

వెనుతిరిగి జీవితంలో పడేందుకు
నీకు నువ్వంటూ ఏమీ తగలకపోవచ్చును

11.10.2020 1.50 మధ్యాహ్నం
ఈమాట జూన్ 2021

# ఒక్క క్షణం

ఒక్క క్షణం
నిజంగా నువ్వేమీ కానప్పుడు
ఇంత ప్రపంచం
ప్రతిబింబమై తేలిపోయినప్పుడు

శబ్దం లోపల శబ్దమేమీ లేనట్లు
కాంతి లోపల కాంతి జాడే కనరానట్లు
నీ లోపల నువ్వు ఏ మాత్రమూ లేనప్పుడు

తటాలున
నువ్వు జీవితానివై మిగులుతావు
ఖాళీ ఆకాశానివై చలిస్తావు

వేల కాంతివత్సరాల కావలి నక్షత్రం
నిన్ను తాకుతూ వెళ్ళిపోతుంది

హఠాత్తుగా
నువ్వు ఏమీ కాకపోవటంలోకి జరిగినప్పుడు
కలగంటున్నావో, జీవిస్తున్నావో తెలియకుండాపోతుంది

దృశ్యాలన్నిటినీ విప్పుకొని
పురాతనశూన్యంలో సేదదీరుతున్నట్లుంటుంది

ఏదైనా ఒక్క క్షణం
ఇక దయ తలచి
నిన్ను ఏమీ కానీయకుండా విడిచినప్పుడు

కోట్ల క్షణాలు
తటాలున నీ నిశ్చలత్వాన్ని విడిచి
తెలియరాని ఖాళీలోకి
పక్షులగుంపులా ఎగిరిపోయినట్లుంటుంది

30.3.2018 7.00 సాయంత్రం
నవ్య వారపత్రిక 26.9.2018

# వాన కురిసింది

వాన పడుతుంది
వానకి పెద్ద కోరికలేమీ లేవు
ఊరికే కురుస్తుంది

కురవాలని కూడా వానకెవరూ చెప్పినట్టు లేదు
ఊరికే అది పుట్టింది, కురుస్తుంది

వాన పుట్టినపుడే ఇంద్రధనువూ పుట్టింది
ఉరుములూ, మెరుపులూ పుట్టాయి
వాటిని అలల్లాగా తరలించే గాలీ పుట్టింది

మనలో మాట
వాన పుట్టినపుడే
దానిని కమ్ముకొన్న ఆకాశమూ పుట్టింది

వాన తనని తానే కప్పుకొని మేఘమయింది
మేఘం తనని విప్పుకొని చినుకయింది
చినుకు తనని విప్పుకొని సారమయింది
సారం తనని విప్పుకొని పచ్చదనమయింది

పచ్చదనమే పక్షులయింది
మనుషులయింది
మాటలయింది
పాటలయింది

వాన ఎప్పుడు, ఎక్కడ, ఎలా పుట్టిందో
తెలియదు కానీ
వాన పుట్టాకనే పుట్టుక కూడా పుట్టింది
వాన కురిశాకనే
నువ్వూ, నేనులు కూడా కురిశాయి

వాన ఎందుకు కురుస్తుందో తెలీదు
ఊరికే జీవితంలా అది కురుస్తూనే ఉంటుంది

5.7.2020 12.30 మధ్యాహ్నం
ఆదివారం, ఆంధ్రజ్యోతి దినపత్రిక 6.9.2020

# నీ బిడ్డలలో

నీ బిడ్డలు పెద్దవాళ్ళు కావటం
నీ కెప్పటికీ అర్థంకాదు

వాళ్ళింకా చిన్ని పాదాలతో
గదిలోని దూరాన్ని ఈదుతున్నట్లే ఉంటుంది
చిన్ని మొహాల నిండా పెద్ద కళ్ళలో
లోకంలోని ఆశ్చర్యాన్నంతనీ
ప్రతిఫలిస్తున్నట్లే ఉంటుంది

వాళ్ళలోంచి ప్రకటించుకొంటున్న జీవితం
జీవించటం మినహా మరేమీ చేయవద్దని
నీతో చెబుతున్నట్లే వుంటుంది

వాళ్ళు పెద్దవాళ్ళు కావటమంటే
దేవుడు దేవుడు కాకుండా పోవటమనే భావమేదో
నీ బిడ్డలు నీకు పెద్దవాళ్ళుగా కనబడకుండా
మాయ చేస్తుంది

బహుశా
నీ బిడ్డలలో నిన్ను చూసుకునేవేళ
నీ పసిదనపు పాలవాసన ఏదో
నీ నాసికని తాకుతుంది

2.8.2020 1.10 మధ్యాహ్నం

# ఎదురుచూస్తూ

నాలుగుగంటలు పడుతుంది డాడీ,
ఏం చేస్తారు, ఎదురుచూస్తారా అంది అమ్మాయి
పరీక్ష రాయటానికి వెళ్లబోతూ
చూద్దాం, ఎలా గడుస్తుందో అన్నావు
ఖాళీపూట నదిలో స్నానానికి దిగబోతున్న ఉత్సాహంతో

ఎదురుచూడటమేమీ
తప్పించుకోవాల్సిన అనుభవం కాదు
ఎదురుచూపు దారం కొసన ఎగిరేటపుడు
కిందికీ, పైకీ, నలువైపులకీ
ఖాళీసమయం ఆకాశంలా విస్తరిస్తుంది

ఇప్పుడీ చెట్ల ఆకుల్లో
రుతువులే జీవనానందాన్ని దాచాయో శోధించవచ్చు
నీడల సంకేతాలతో
సూర్యుడు భూమితో చేసే రహస్యభాషణ వినవచ్చు

ఎవరో అటు నడిచి వెళ్ళటాన్నో,
దూరంలో తేలుతున్న సంభాషణనో
నీ దేహమంతటితో శ్రద్ధగా ఆస్వాదించవచ్చు

జీవితం మోపిన వత్తిళ్లు మరచి
ఒక్కొక్క క్షణాన్నీ అనుభవించవచ్చు
నలువైపులకీ పలుమార్లు విసరబడే నిన్ను
ఒక్కచోటికి చేర్చుకొని చూసుకోవచ్చు

నిజానికి, ఎదురుచూడటం మినహా
ఇక్కడ చేస్తున్నదేమీ లేదు
తెలియనిచోటు నుండి వచ్చి
తిరిగి తెలియకపోవటంలోకి వెళ్ళటానికి
ఎదురుచూస్తూ వున్నావు

నీ విధుల వెనుక నెలాఖరు జీతమున్నట్టు
నీ పనుల వెనుక
వెళ్ళిపోవటానికి ఎదురుచూపు వుంటుంది

పనుల మధ్య ఖాళీల్లోకి
ఇష్టమైన పాట పాపాయిలా వచ్చి పలకరించినట్టు
నీ రోజుల్లోని ఇలాంటి ఖాళీల్లోకి
నిన్నిక్కడ ఉంచి వెళ్లిన అనంతం వచ్చి పలకరిస్తుంది

బహుశా, అపుడు
నువు పుట్టనే లేనంత భారరహితమై
జీవితాన్ని నిసర్గంగా,
ఉత్త జీవితంగా కాసేపు జీవిస్తావు

29.9.2020 10.40 ఉదయం విష్ణు కాలేజి
దిక్సూచి, ముంబై సెప్టెంబర్ 2021

# తెంచుకొంటూ..

1
హాస్టల్ ముందు విడిచాక
వెనుతిరిగి చూడకుండా వెళ్ళిపోతోంది అమ్మాయి

అమ్మా, నాన్నల భద్రప్రపంచంలోంచి
తనదైన ప్రపంచంలోకి నడవక తప్పదనుకొంటూ,
దిగులు తీగల్ని కన్నీటితో కత్తిరిస్తూ,

మలుపులోకి వేగంగా మాయం కావటానికి
తలవొంచుకొని నడుచుకొంటూ వెళుతోంది

2
ఎందుకు ప్రేమిస్తాం, లేదా ప్రేమించబడతాం
ప్రేమలతలు వదులైనచోట చలిముసిరే ప్రపంచంలో
ఎందుకు ఏకాకులమై విలపిస్తాం

ఇందుకేనా ప్రేగు తెంచుకు పుట్టేది
తెంచుకోవటమెలానో పదేపదే నేర్చుకొనేటందుకేనా

3
మలుపులోకి మాయమైన అమ్మాయికి
బాల్యం మరికాస్త మాయమౌతుంది
తలిదండ్రులు మరికాస్త మసకబారతారు

ఆమె తనదైన జీవితంలోకి క్షేమంగా సాగిపోవటాన్ని
వాళ్ళు వెనుకబడుతున్న చల్లని నీడలై గమనిస్తూ వుంటారు

4
ఎక్కడి నుండి ఎక్కడికి వెళుతుంటాం అందరం
ఎందుకని ప్రేమలై కలుస్తాం
ఎందుకని ఒకరి నొసటిపై ఒకరం దిగులురేఖలై విడిపోతాం

కానివ్వు తల్లీ, జీవితమా
అందరిలోంచీ నిన్ను ప్రేమించాలని స్వప్నిస్తావు కదా
నిన్ను మరిచి అందరినీ ప్రేమిస్తున్నందుకు
నీకెంత దిగులు కలుగుతుందో మా కిలానైనా తెలియనివ్వు

23.12.2016 9.30 రాత్రి
నవ్య వారపత్రిక 3.3.2018

# నచ్చేలా..

జీవితం ఉక్కగా ఉంది
అందరికీ నచ్చేలా బ్రతకటంలో పడి
నాకు నచ్చేలా బ్రతకటం మర్చిపోయాను అంది అమ్మాయి

'తాను మాత్రమేనా, నేనూ అంతే
బహుశా అందరూ అంతే' అనుకున్నావు

తనకి నచ్చేలా బ్రతికేవాళ్ళలో బాల్యం వుంటుంది
సరస్సు మీంచి వీచే ఉదయపు గాలీ,
కొమ్మల్లోంచి వాలే బంగారు కాంతీ
వాళ్ళ కోసమే ఈ లోకంలోకి వచ్చినట్టు వుంటుంది

జీవితం వాళ్ళచుట్టూ ఉత్సవభరితమై
పసిపిల్లల్లా గంతులేస్తున్నట్టు వుంటుంది

ఆకాశాన్ని విప్పుకొన్న పక్షిలానో,
అడవిని చుట్టుకొన్న జంతువులానో
రేపటి దిగుల్లేని జీవితం గడిపేవాళ్ళని చూస్తే
సమూహానికెప్పుడూ ప్రశ్నగా ఉంటుంది

వాళ్ళని చూస్తే కొండ అంచున నడిచేవాళ్ళని చూసినట్టూ,
మృత్యువుతో దోబూచులాడే జీవితాన్ని చూసినట్టూ వుంటుంది
కాస్త ఆకర్షణగా, కాస్త భయంగా
జ్వలిస్తున్న దేనినో దగ్గరగా చూస్తున్నట్టుంటుంది

చెట్టులాగా ఉన్నచోటనే ఉనికిలోనికి మునిగి
తమలో నుండే తేలుతూ ఉండేవాళ్ళని చూస్తే
వాళ్ళని మూసపోసిన జీవితంలోకి ఒంపేవరకూ
మనకి కాస్త ఆందోళనగానే వుంటుంది

చెట్టు ఎలా ఎదగాలో, కొమ్మలు చాపాలో
ఏయే ఋతువుల నెట్లా గానం చేయాలో
ఏయే ఎండల్లోకి నీడలవల లెట్లా విసరాలో
విత్తనంలోనే దాగి వున్నట్టు

ఎలా బ్రతకాల్సి వుందో పుట్టుకలోనే దాగి వుంది గనుక
నిన్ను నువ్వూ, వాళ్ళని వాళ్ళూ
చల్లగా బ్రతకనివ్వాలి అంతే కదా అమ్మాయీ

23.1.2021 10.45 ఉదయం
ఆదివారం, ఆంధ్రజ్యోతి దినపత్రిక 3.10.2021

# ఒక చిన్ని ప్రపంచం

కనబడగానే ఆమె
తన చిన్ని ప్రపంచం మూట విప్పుతుంది
నీతో పంచుకోవాలని

మనుషులూ, వాళ్ళ మనుషులూ
మాటలూ, వాటి మాటలూ
సందర్భాలూ, వాటి సందర్భాలూ

నీకేమీ ఆసక్తి ఉండదని ఆమెకీ తెలుసు
పంచుకోవడానికి, పాపం, ఒకరు కావాలి
గోడైనా, గోడలాంటి మనిషైనా చాలు
ఊరికే పంచుకోవటంలోని సంతోషం కోసం ఆమె

బహుశా,
పంచుకొని, పంచుకొని భారరహితమైనపుడు
మేలుకొనే ఒక విశ్రాంతి కోసం

కాస్తైనా దయ ఉండదు నీకు
గభాలున అనేస్తావు
నా పెద్ద ప్రపంచంలో
నీ చిన్ని ప్రపంచానికి చోటు లేదని

నీ మాటల్లోని
విరోధాభాస గమనించలేని
పెద్ద ప్రపంచం నీది

ఒకసారి విని చూడరాదూ
ఆమె చిన్ని ప్రపంచాల తలుపుల్ని తెరుచుకొని
ఏ మహాలోకాలు
నీపై దూకి ఉక్కిరిబిక్కిరి చేయబోతున్నాయో

ఊరికే విని చూడు
నీ మహాప్రాకారాలకి
కిటికీలు తెరిచే ఆమెలోని పసిదనాన్ని

16.7.2020 1.00 మధ్యాహ్నం
ప్రజాశక్తి దినపత్రిక 2.8.2020

# వీధి అరుగుపై ..

ఆమె వీధి అరుగుపై కూర్చుని
దారినపోయే అందరినీ పలకరిస్తుంది

ఎలా ఉన్నారనో, ఏం చేస్తున్నారనో అడుగుతుంది
తోచిన మాటలేవో వడపోత లేకుండా మాట్లాడుతుంది

ఊరికే మాటల కోసం ఆమె
మనుషుల్ని కదిలించటం కోసం ఆమె
బ్రతికి ఉన్న స్పృహ ఏదో
తనలో, మనలో మేల్కొలపటం కోసం ఆమె

మనుషులు కాలువలో నీటిలా వెళ్లిపోతూ వుంటారు
ఆమె ఒడ్డున నిలబడి
నీటిపైకి నీడని పరిచిన చెట్టులా పలకరిస్తుంది

ఇప్పుడేమీ అనిపించకపోవచ్చు
వినేవాళ్ళకి కాస్త విసుగు పుట్టవచ్చు

ఆమె అరుగుపై కనిపించని రోజుల్లో
అక్కడి వెలితి కాళబిలంలా
జీవనకాంతిని పీల్చుకొన్నపుడు తెలుస్తుంది

ఇన్నాళ్ళూ అక్కడ కూర్చుని మాట్లాడింది
ఆమె కాదని, జీవితమని

5.8.2020 2.40 మధ్యాహ్నం
ఈ మాట నవంబర్ 2020, కవిత్వం 2020

# వీధిచివర

వీధిచివర తిరుగుతూ కనిపిస్తాడు
ఆ ప్రపంచం లేని యువకుడు

నువ్వున్న కాలంలోనే అతనూ వున్నాడు
నువ్వున్న ఆకాశం క్రిందనే,
నువు ఊపిరి పీల్చే గాలివలయాలలోనే
జీవిస్తూ అతను కూడా

ఎక్కడ పుట్టాడో
నీకే కాదు, అతనికీ తెలియదు

నువు వెచ్చగా గదిలో నిద్రపోతున్నపుడు
ఏ చలీ, వేడీ తాకని అనంతంలో నిద్రపోతాడు
నువు ఆకలిని వేడిగా, రుచిగా చల్లార్చుతున్నపుడు
విశాలమైన ఆకాశాన్ని ఆవాహన చేస్తూ వుంటాడు

ఆ వీధి చివరి యువకుడికి
వెచ్చని గూడూ, నులివెచ్చని మనుషులూ,
తన కోసం వాటిని కావలి కాచే భయావరణాలూ
ఎందుకు అవసరం లేకపోయాయి

ధూళి నిండిన శరీరంపై
ఆవు దూడని నాకుతున్నట్టు పొరాడే ఎండా,
చుట్టూ వలయాలు తిరుగుతున్నా
తనకేమీ పట్టని మానవ జీవితాల సంగీతమూ,

రాత్రులూ, పవళ్ళూ చుట్టూ పహరా కాసే
తనదైన మహా ఏకాంతమూ ఎలా సరిపోయాయి

ఇంత నాగరికతనీ, పురోగతినీ
బట్టల మీది దుమ్ములా దులిపి చూపే
ముఖంలోని నైర్మల్యం ఎలా పొందగలిగాడు

వీధిచివరి యువకుడికీ,
ఇంత పెద్ద మానుష ప్రపంచానికీ మధ్య నిలిచి
నువ్వేం ఆలోచిస్తున్నావు ఇప్పుడు

26.10.2020 12.50 మధ్యాహ్నం
కవితా 2021

# వీధి బాలుడు

వీధిలో ఒక బాలుడు చేయి చాపాడు
వాళ్ళు కనీసం చూడలేదు

బాలుడి ముఖంలోని దిగులు
మేఘం కింది నీడలా కదులుతోంది
నేలవైపు తిరిగిన చూపుల్లో
ఏ దుఃఖాలకి బీజాలు పడుతున్నాయి
ఏ ప్రశ్నలు మొలకెత్తుతున్నాయి

తెలియకుండా తీసుకోవటం నేర్చినవాడికీ,
తెలియకుండా ఇస్తున్నవాడికీ మధ్య
అనాదిగా జరుగుతున్న సంభాషణ ఇది

తీసుకున్నది తిరిగివ్వటం అతనికి తెలియదు,
ఇచ్చింది తీసుకోవటమెలానో ఇతనికి తెలియదు

వారి మధ్యనున్న అంతు తెలియని లోయలో
మానవ జీవనానందం సుడులు తిరుగుతూ మునుగుతోంది

ఇదేమీ బాగా లేదు
ఇవ్వటమూ, తీసుకోవటమూ
లాక్కోవటమూ, దానం చేయటమూ

మనుషులు పంచుకోవాలి
ఉన్నది ఇతరులతో, లేనిది ఇతరుల నుండి.,
చేతులు మార్చాలి స్వేచ్ఛగా, నిర్మోహంగా, సరదాగా
ఆటల్లో బంతిని అందుకొన్నట్టు, ఇచ్చినట్టు

ఒక కలగంటావు
కొండలూ, లోయలు దాటి మైదానం చేరిన నీరు
పరుగాపి జీవిత సరస్సుగా వికసించినట్టు
ఆకాశమంత శాంతిని ప్రతిఫలించినట్టు

మనుషులు భయాల గుప్పెళ్ళు తెరిచినట్టు,
'నాది'గా బిగిసిన కఠినహృదయాలు మంచుతెరలైనట్టు,
మానవజాతి పసిపిల్లల్లా ఉండిపోయినట్టు,

నువ్వూ, నేనులు చెరిగిన విశాల మైదానాల్లోకి
ప్రేమలు ఎగిరి, నవ్వులు కురిసినట్టు,
కాలం ఆనందంతో తడిసి ముద్దయినట్టు

వీధిబాలుడిలో
ప్రశ్నల్ని మేలుకొలిపే గతానికి బదులుగా
భవిష్యత్తు కోసం కలల్ని మేలుకొల్పుతావు

తెలియరాని ఏకాంత దుఃఖతలాల్లో
అతన్ని దగ్గరకు తీసుకొని ముద్దు పెట్టుకుంటావు

19.11.2020 1.30 మధ్యాహ్నం

# వాళ్ళిద్దరూ ..

రోడ్డుకవతల మాట్లాడుకుంటున్నాయి
నడివయసు నిరుపేద జీవితాలు
మోయాల్సిన సంపదలు లేక కావచ్చును
వాళ్ళ తీరిక నిండా తేలికదనం

వాళ్ళ చుట్టూ వెలుగునీడలు
ముఖాల నిండా జీవితం గడిపిన జాడలు
ఏమి మాట్లాడుకుంటున్నారో తెలియదు
జీవితాల్లోని ఇరుకు ఎంత సతాయిస్తోందో తోచదు

నీకైతే అక్కడ కనబడేది
ఇద్దరు మనుషులు కాదు

రెండు ఆకాశపు తునకలు
రంగురంగుల జ్వాలలు
దేహం దాల్చిన సముద్రపు అలలు
నేల నిదురలోని నిండైన కలలు

అక్కడ ఇప్పుడు కనబడేది
అమాయకంగా ప్రపంచాన్ని మోస్తున్న
రెండు ఖాళీ కేంద్రాలు
ఇద్దరిగా శ్వాసిస్తున్న ఒక దేవుడు

13.3.2021 4.10 మధ్యాహ్నం

# మలిసంధ్యవేళ..

ఆమె రాయమంటుంది కొన్ని అక్షరాలు
'ఎన్ని రాస్తే, సడిచేయని వెన్నెల పాదాలవుతాయి
వానచినుకు నేలపై తెరిచిన వృత్తాలవుతాయి
పోనీ, సీతాకోక ఎగిరిపోయిన ఖాళీలవుతాయి' అంటావు

పలకమంటుంది కొన్ని పదాలు
'ఎన్ని పలికితే, జీవనసారంలోంచి వికసించే చిరునవ్వులవుతాయి
దుఃఖపుశిల చెమరించిన కన్నీరవుతాయి
స్పర్శలో మేలుకొనే దయాపూర్ణ లోకాలవుతాయి' అనుకొంటావు

ఊరికే కూర్చుందామా దగ్గరగా కాసేపు అంటుంది
'ఎన్ని యుగాలు కూర్చుంటే తనివి తీరుతుంది
ఎంత సమీపిస్తే మనమధ్య వెలితి నిండుతుంది
ఏనాటి వేసవిగాడ్పు ఇక విడదీయక వెళ్ళిపోతుంది' అనిపిస్తుంది

ఆమె తన లోపలికి వెళుతూ
దయగా నిన్ను నీ లోపలికి వెళ్ళమంటుంది
పచ్చిక మైదానంపైన నక్షత్రాలు మెరుస్తాయి
ఇద్దరూ లేని ప్రశాంతి చలిగాలిలా సాంద్రమవుతుంది

31.8.2021 6.40 సాయంత్రం
ఈమాట సెప్టెంబర్ 2021

# నువు

ఊహలాంటి మనిషివి నువ్వు
ఎప్పుడు, ఎందుకు వస్తావో తెలీదు
ఎలా మాయమౌతావో తెలీదు

జీవితంలాంటి మనిషివి
వస్తే, ఎందుకు నిండి పోతానో
వెళితే, ఎందుకు ఖాళీ అవుతానో తెలీదు

ఉదయంలాగా వచ్చి, రాత్రిలా వెళ్ళిపోతావు
వెలుతురులాగా నిండి, చీకటిలా ఖాళీ చేస్తావు

నిన్ను వెదకటానికి పుట్టానా, పుట్టి వెదికానా
నిన్ను కలగని దిగులు పడ్డానా,
దిగులుపడి కలగన్నానా
కనుగొని ఊరట పొందానా,
ఊరట పొంది కనుగొన్నానా

నా నుండి విడివడి నువ్వు నువ్వయావా,
నీతో నిండి నేను నేనయానా

ఊరికే రావా జీవితంలోకి
సీతాకోకలా, ఉదయపు నీరెండలా,
నక్షత్రాల కాంతిలా, ఉత్తప్రేమలా

వచ్చి, వెళ్ళవా నాలోకి
వానగాలిలా, పసినవ్వులా
తీసుకుపోవా ఊరికే నీ లోకానికి
ఉత్తక్షమలా, దయలా, చివరికన్నీటిలా

అవేమీ కాదు గానీ
నన్ను చెరిపేసి, నేను నువ్వుగా వెలగవా..
ఊరికే మిగలవా ..

21.9.2022 1.00 రాత్రి
ఈమాట డిసెంబర్ 2022

# ముప్పై ఏళ్ళ తరువాత..

ముప్పై ఏళ్ళ క్రితం
చివరిసారి ఆమెను బస్సులో చూసావు
చివాల్న తల త్రిప్పుకొంది
మరిచిపోదలిచింది ఇక అనుకున్నావు

అటు తిరిగిన మొహంలో
ఎన్ని కన్నీళ్లు జలజలా రాలాయో
నీకు తెలియలేదు

సాఫీగానే సాగిపోయిన జీవితాల వెనక
ఇద్దరూ ఒక వెలితిని మోశారు

విడిపోయిన బాధని
ఒక కొస నుండి నువ్వూ,
మరో కొస నుండి ఆమే
వెలిగిస్తూనే వున్నారు లోలోపల

మనుషుల్నీ, కాలాన్నీ వేటినీ శపించలేదు మీరు
మీ వెలితిలోంచి, తడినేత్రాల్లోంచి, ఏకాంతాల్లోంచి

మరింత దయగా, దృఢంగా, లోతుగా
కావలించుకున్నారు ఈ జీవితాన్ని, లోకాన్ని

మీరు నిజంగా ప్రేమించుకున్నారు గనుక
గాయపడలేకపోయారు
ప్రేమ గాయాలు చెయ్యదు,
లేపనం పూస్తుందని మీకు అనుభవమైంది

కనుకనే, ముప్పై ఏళ్ళ తరువాత ఎదురుపడినపుడు
మీరు ఏ రోజూ విడిపోలేదని,
ఒకటిగానే ఉన్నారని కనుగొన్నారు

ఇన్నేళ్ళుగా ఒక జీవితాన్నే
ఇద్దరూ రెండు కొసల నుండి
జీవించారని తెలుసుకున్నారు

8.11.2021 12.50 మధ్యాహ్నం

# ఆమె జ్ఞాపకం

ఎక్కడో, ఎప్పుడో చూసిన ఆ ముఖం గుర్తుకువస్తుంది
ఆ కళ్లలో తొణికిసలాడే లాలనా
నవ్వులోంచి వికసిస్తున్న కొంటెదనమూ
పొగమంచులా చల్లగా, దయగా కంటిముందు మెరుస్తాయి

దిగులేదో మేలుకొంటుంది
ఆమె ఇప్పుడు, ఇక్కడ
నీ ప్రక్కన మౌనంగానో, మాట్లాడుతూనో కూర్చోవాలనే దిగులు
ఊరికే నీ కంటిముందు తిరుగుతూ కనిపించాలనే దిగులు

తన హృదయస్పందనలో, నవ్వులో, చూపులో
నీ జీవనసారమేదో మెరుస్తూ కనిపించాలనే దిగులు

అలవిమాలిన దిగులు
పక్షులరవాల్ని మునివ్రేళ్ళతో తాకలేకపోతున్న దిగులు
ఇంద్రధనువు రంగుల్ని చేరలేకపోతున్న దిగులు
దేహాల్ని విప్పుకొని ఒకే సౌందర్యంలోకి కరిగిపోలేని దిగులు

ఉన్నట్లుండి ఆమె మాయమౌతుంది
ఏ శూన్యం ఆమెగా కనిపించిందో ఆ శూన్యంలోకి
ఉన్నట్లుండి నువ్వూ చెరిగిపోతావు
ఏ ఖాళీదిగులు అలలా ఎగసిందో ఆ ఖాళీలోకి

ఉత్త దయ ఏదో, స్వచ్ఛమైన వాంఛ ఏదో, శాంతి ఏదో
మీరు మాయమైనచోట మృదువుగా పరివ్యాప్తమౌతుంది

ఇప్పుడు, ఇక్కడున్నవి చెట్లూ, శబ్దాలూ కావు
ఒక తెలియరాని జీవనకాంక్ష, ఒక నాట్యం
ఇప్పుడు ఇక్కడున్నవి స్థలకాలాలు కావు

ఒక అనాది నిశ్శబ్దం..
అంతా తానైన జీవితం..
ఏదీలేని ఖాళీ మెలకువ..

15.1.2020 11.00 ఉదయం
నవ్య వారపత్రిక 12.2.2020

# ఆవలితీరం మిత్రునికి

1
ఇక వెళ్లిపోయారు కదా
మన ఇద్దరి ఒకే మౌనాన్ని దాటి
ఇప్పుడు మాట్లాడుకుందామా

మీదైన ఏమీలేనితనంలోకి
హాయిగా చేరుకున్నారు కదా

నావైన ఉద్వేగాలనీ, దృశ్యాలనీ,
దుఃఖంగా, నిర్వేదంగా, సంతోషంగా, నిర్లక్ష్యంగా
నేను అల్లే పదాలనీ, కథనాలనీ

మీరు ఉండీ లేనప్పటి లానే
లేకపోవటమై ఉన్నప్పుడు కూడా పంచుకోనా

2
'అన్నీ ఒకలాంటివే గనుక, దేనికీ విలువలే'దని
'ఉండటమూ, లేకపోవటమూ ఒకలాంటివే గనుక
లేకపోవటంలానే, ఉండటమూ విలువలేని'దని చెప్పబోతున్నారా

విలువకి కూడా ఏ విలువా లేదని,
మన సాయంత్రాల నీరెండలానే జీవితం కూడా
ఇలా వాలి, అలా మాయమయే మంత్రనగరి గనుక
'పెద్దగా పట్టించుకోకండి' అని ఊరట నివ్వబోతున్నారా

3
మిమ్మల్ని నాకోసం నాలోంచి సృజించుకొన్నానా
నన్ను మీకోసం మీలోంచి సృజించుకొన్నారా

నేను మిమ్మల్ని సరిగా కలగనలేదు సరే
మీరైనా నన్ను సరిగా కలగనాలి కదా
మీ లోంచి సృజించుకున్న నన్ను
ఈ భయావహ లోకతలంలో వదిలి ఎలా వెళ్ళిపోతారు

4
జీవనదుఃఖం మేలుకొన్న కాలం నుండీ తోడు నడిచారు సరే,
ఒంటరిగా నడవగల మీరు నన్ను పంపించి కదా వెళ్లవలసింది

'ఊరుకోండి' అంటారా ఇప్పుడు కూడా
అన్నీ ఓర్చుకోవటం తెలిసిన మీరు
ఇక్కడ ఊరికే జీవించి ఉండాల్సింది,
అన్నిటికీ చలించే నన్ను మీ బదులుగా పంపించి ఉండాల్సింది

(తాత్విక సహచరుడు ఆలపాటి రాంబాబుగారి స్మృతిలో)

11.7.2019 7.20 రాత్రి
నవ్య వారపత్రిక 9.10.2019

# ఖాళీ ద్వారం

1

ఒక్కొక్కరూ వెళ్లిపోతుంటారు
నీ ముందో, నీతోనో నడిచినవాళ్ళు
తెలియని ఖాళీలోంచి తెలియెండలోకి ప్రవేశించినవాళ్ళు

జలతారు రాత్రుల తెరలు తొలగించుకొంటూ
తెలియరాని ఖాళీలోకి మళ్లీ తరలిపోతారు
క్షణాల్ని అక్షరాల్లోకి ఒంపుతున్న నువ్వు కూడా
నీ ఖాళీద్వారం కోసం తడుముకొంటూ నడుస్తావు

2

ఉన్నపుడు వాళ్ళతో నువ్వు ఉన్నదెంత
లేనపుడు వాళ్ళతో కోల్పోయిందేమిటి

మంచుబిందువులాంటి క్షణం అంచున మెరిసే జీవితంలో
వారూ, నువ్వూ, అనుభవమూ
మిగుల్చుకున్నదేమిటి, పోగొట్టుకొన్నదేమిటి

ఆకాశం సాక్షిగా కదిలిపోయిన కథలనిండా
కన్నీరు ఎంత, ఖాళీల పాళ్ళెంత

3

ఉద్వేగం ఒక మహత్తు, ఊహ ఒక అద్భుతం

రెండు ఉద్వేగాలు ఒక్కటై కొత్త ఎత్తులకి ఎగసిపడటం
రెండు ఊహలు ఒక్కటై కొత్త లోకాల్లోకి మేలుకోవటం
ఒకరి చీకటిలోకి ఒకరు వెలుతురై చొరబడటం
ఒకరి శబ్దాలు మరొకరి మౌనంలో శమించటం

మానవసంబంధాలతో
జీవితం సంగీతం కావటం బావుంటాయి కానీ,
నీ నుండి తప్పుకు తిరగటానికి దారులు తెరుస్తాయి కానీ,

ఎప్పటికైనా నీలోకి ఒక్కడిగా నడవక తప్పదని
వెళ్లిపోయే ప్రతిమనిషీ చివరిశ్వాసతో చివరి సంభాషణ చేస్తాడు

4

ఆకాశం లోపలి నుండి అకస్మాత్తుగా మెరుస్తాం
ఒకరినొకరం పట్టుకొనేలోగా మాయమౌతాం

ఖాళీ చేతులపై వీచే గాలి
ఏ ఆత్మీయుని అదృశ్యస్పర్శనో తెలియదు కాని
నీ కన్నీటిబిందువు లాలనగా గాలిలోకి రాలుతుంది

మరీచికల్లాంటి బంధాలు చెదిరిపోయాక
నీ లోలోపలి సుషుప్తిలో
నువ్వూ, వాళ్ళూ ఒకటికావటంలోకి మేలుకొంటావు

9.3.2019

నవ్య వారపత్రిక 17.4.2019

# ఉన్నట్టుండి

ఆకాశంనుండి అకస్మాత్తుగా చినుకు రాలినట్టు
కొమ్మనుండి నెమ్మదిగా పూవు రాలినట్టు
దిగుల్లోంచి తటాలున నవ్వు రాలినట్టు
నవ్వుల్లోంచి నిశ్శబ్దంగా కన్నీరు రాలినట్టు

ఉన్నట్టుండి నువ్వు వెళ్ళిపోతే ఏమౌతుంది
నీ చోటు ఖాళీ చేస్తే ఏమౌతుంది
నువు చలించటం మానేస్తే ఏమౌతుంది
వెచ్చని స్పందనని ఏదో చల్లదనం కమ్మితే ఏమౌతుంది

నీరు తోడినచోట కొత్త నీరు చేరినట్టు
శబ్దాన్ని తోడినచోట కొత్త నిశ్శబ్దం చేరినట్టు
దృశ్యాన్ని చెరిపినచోట కొత్త ఆకాశం కనులు విప్పినట్టు

ఉన్నట్టుండి వెళ్ళిపోయినచోట
జీవితం నెమ్మదిగా కొత్త చిగుర్లు తొడుగుతుంది
మొక్క కొత్త తొడిమెలని కలగంటుంది
చీకటిలో దాగిన ముఖాలని
తెలియెండ వెదికి మరీ ముద్దాడుతుంది

ఉన్నట్టుండి నువు విడిచివెళ్ళిన లోతైన ఖాళీని
జీవితం దయగా మరింత సారంతో నింపుతుంది

6.4.2018 12.00 మధ్యాహ్నం
నవ్య వారపత్రిక 19.12.2018

# మెలకువ

'నిజం చెప్పు,
ఇదంతా అనుభవించి మాట్లాడుతున్నావా'
అన్నాడు మిత్రుడు
'లేదు, ఆశించి మాట్లాడుతున్నాను' అన్నావు

'పంచేంద్రి యానుభవాల పంజరానికి
అవతల ఏదో ఉందనీ
అది తెలిస్తే, పొందితే, అనుభవిస్తే
అదిగా అయిపోతే, ఉండిపోతే

చందమామపై బెంగతో
వెన్నెల ద్వారా చేరే దారి వెదక నక్కర్లేదనీ,
నువ్వే చందమామవీ, వెన్నెలవీ,
వెన్నెలలాంటి చల్లని అనుభవానివీ కావచ్చనీ

దు:ఖిత హృదయాలకు
ఊరట కోసం తపించనక్కరలేదనీ
నువ్వే దు:ఖితుడివీ,
దు:ఖం లోపలి ఆనందానివీ కాగలవనీ

భయంలోకో, బెంగలోకో, వెలితిలోకో
జీవితం అంచుల నుంచి జారిపోతున్న నిన్ను
పదేపదే, నిలిపే ప్రయాస పడనక్కరలేదనీ

అద్దంలోంచి దూకబోయే ప్రతిబింబంలా
జీవితంలోంచి ఒక్క ఉదుటన బయటపడే దారి కోసం
కలగంటావు, తడుముకుంటావు, దుఃఖిస్తావు
ఆలోచిస్తావు, ప్రార్థిస్తావు

నిజం చెబుతున్నాను..
ఉత్త ఆశ తప్ప, అనుభవం లేదిక్కడ
కోరిక తప్ప, చేరువ లేదిక్కడ
కల్పన తప్ప, వాస్తవం లేదిక్కడ'.

మిత్రుడు అంటున్నాడు
'ఏమి మాట్లాడుతున్నావో తెలుస్తుందా,
అనుభవమే లేనప్పుడు, అది ఉండటమూ లేదు, లేకపోవటమూ లేదు
దూరమే లేనప్పుడు, కోరికా లేదు, చేరువా లేదు
ఉనికే లేనప్పుడు, కల్పనా లేదు, వాస్తవమూ లేదు..'

అతని చివరిమాట ముగుస్తూ వుండగా
అకస్మాత్తుగా మెలకువ వచ్చింది

6.11.2020 12.00 మధ్యాహ్నం

# తనని విడిచి..

నగరానికి రమ్మన్నాడు మిత్రుడు
అక్కడ చూసేదేం లేదు
మా ఊరిలోలానే అక్కడ కూడా
ఇటుకలతో నిర్మించిన ఆశలూ, భయాలూ

పోనీ, అడవికి పోదామన్నాడు
ఇక్కడిలానే అక్కడ కూడా
ఆకుపచ్చని కాంతి మరికొంత చిక్కగా
తేలికైన గాలి మరికాస్త స్వచ్ఛంగా
ఏమంత ఆసక్తి లేదన్నాను

ఇక్కడ శబ్దాల మధ్య నిశ్శబ్దం వెదకాలి
అక్కడ నిశ్శబ్దాల మధ్య శబ్దం దాగి వుంటుంది
నిశ్శబ్దాన్ని విందాం, బావుంటుంది అన్నాడు
మౌనంగా వున్నాను

చీకటిని చూడటానికి ఎక్కడికీ వెళ్ళనక్కరలేదు
రాత్రి వరకూ వేచి ఉంటే చాలు
నిశ్శబ్దాన్ని వినటానికి అడవికి పోనక్కరలేదు
తనని తాను వినబోతే చాలు

మనం కలవడం బావుంటుంది
గాలికి తిరగటంలో జీవితముంది అన్నాడు

ఇక తప్పదు, వెళ్ళాలి
ఊహ తప్ప,
ఎవరూ తనని విడిచి ఎవర్నీ కలవలేరని
మరొకసారి తెలుసుకోవడానికి

భ్రమ తప్ప,
ఎప్పుడూ తనని విడిచి కదిలిందే లేదని
మళ్ళీ అనుభవం కావటానికి

15.2.2021 11.00 ఉదయం

# పాతబడని..

చీకటి పొదిగిన సూర్యునిలోంచి
తెల్లని రెక్కలు విదిలించుకొన్న వెలుతురు పక్షి
తూర్పు ఆకాశం నుండి పడమటికి ఎగురుతోంది

పగటికాంతి పొదిగిన చంద్రునిలోంచి
చల్లని రెక్కలు మెల్లగా కదిలించిన వెన్నెల పక్షి
తూర్పు తీరం నుండి పడమటికి ఈదుతోంది

ఎందరు కవులు ఊహించి వుంటారో
అక్షరాలా ఇలానో, అటూ, ఇటుగానో

ఊహలు పాతబడతాయి గానీ,
ఊహించటం పాతబడదు
అనుభవాలు పాతబడతాయి గానీ,
అనుభవించడం పాతబడదు

కన్నీళ్ళూ, చిరునవ్వులూ పాతబడతాయి గానీ,
నవ్వటమూ, ఏడవటమూ పాతబడవు
జీవితం పాతబడుతుంది గానీ,
జీవించటం పాతబడదు

అవును, జీవించటం పాతబడదు
దేహం పాతబడినా,
నాకు నేను ఎప్పటికీ పాతబడనట్లు ..

17.7.2020 11.50 ఉదయం
పాలపిట్ట సెప్టెంబర్ 2020

# ఒక మధ్యాహ్నం

జీవితం తనతో తాను జీవిస్తోంది
కుదురుగా బొమ్మలతో ఆడుకొంటున్న పాపాయిలా

తనని తాను చూసుకొంటోంది
గాలికి ఎగురుతున్న పేపరు కొసల్లో,
ఆమె వస్త్రాలపై వాలుతున్న ఎండలో

వింటోంది తనని తాను
టీవీలోంచి పొడిగా రాలుతున్న శబ్దాల్లో,
వాహనాల తొందరలో, మనుషుల చప్పుళ్ళలో

పనిలేని గాలి తనని తానే తాకినట్టు
తీరికగా తనని తాకుతోంది జీవితం
ఆవు దూడని నాకినట్టు,
ఎండ నాలుక చాపి లోకాన్ని నాకుతోంది

జీవించటం మినహా జీవితానికి మరేమీ తోచని
మాఘమాసపు మధ్యాహ్నపు వేళ,
నదిలో మునగటమెలానో తెలియని నువ్వు
పైకి తేలి కాసిని అక్షరాలని పలవరిస్తావు

నిన్ను కుడుతూనే ఎర్రచీమలు చనిపోయినట్టు
జీవితాన్ని పట్టుకొంటూనే అక్షరాలు చనిపోతాయి

7.3.2021 11.40 ఉదయం
ఈమాట ఆగస్ట్ 2021

# నువ్వింతే

చెట్ల ఆకులపై రాలిన కాంతి
గాలి చేయి పట్టుకొని
కమ్ముకొచ్చే కారునల్లని మేఘాలలోకి
ఎగిరిపోవాలని కలవరిస్తోంది

పచ్చటి ఆకుల చాటునుండి
లేతసిగ్గులా తెరుచుకొన్న పూవు
తన రంగుల్ని రహస్యంగా దాచమని
చుట్టూ వికసించిన శూన్యాన్ని ప్రార్థిస్తోంది

ఊరికే కరిగిపోవటానికే
ఉనికిగా మొలకెత్తడమని
నీకు మినహా సమస్తానికీ
స్పష్టంగానే తెలుసనుకుంటాను

నువ్వూ రా, కరిగిపోదువు గాని అని
కన్నతల్లి అనంతమే కరుణతో పిలిచినా

నువ్వింతే, ఇదిగో వస్తున్నానంటూ
ఇలా అక్షరాలు చెక్కుతూ కూర్చుండిపోతావు

16.7.2020 11.50 ఉదయం
కవితా అక్టోబర్ 2020

# పదాల అవతల..

ఊరికే, పదాల వంక చూద్దాం
మంచి, చెడు, మేలు, కీడు
అవేమీ బొమ్మలు కాదు, ఉత్త భావాలు
మననేమీ తాకని పదాలవి

కష్టం, సుఖం, భయం, దిగులు
తాకుతున్నట్టు ఉంటాయి గాని, తాకవు
నీ కష్టం, నా కష్టం ఒకటి కాదు
మన మాటలకి నీ అర్థాలు వేరు, నావి వేరు

పసిబిడ్డ, స్త్రీ, చిరునవ్వు, కన్నీరు
మన అర్థాలు కాస్త దగ్గరే కానీ,
మన స్పందనలు వేరు, వేరు
కన్నీరు నీకేమీ కాకపోవచ్చు, నాకన్నీ కావచ్చును

ఇక మిగిలినవి
కాలువ, చెట్టు, చంద్రుడు, చీకటి
నీకూ, నాకూ ఒకటే కానీ,
హృదయసారాన్ని బట్టి నీలో, నాలో మొలకెత్తుతాయి

కనుక
మన పదాలెపుడూ ఒకదాన్నొకటి కౌగలించుకోవు
ఒకటే పదాలు వాడినా, వాటి జీవితం వేర్వేరు

నిజానికి, పదాలు జీవితానికి పూచేవే కానీ
వాటిలో జీవితం వుండదు
అవి రాలిపోయిన పూలు, వెలిసిపోయిన రంగులు

పదాలన్నీ ఉత్త శబ్దాలు
శబ్దాలన్నీ నిశ్శబ్దంపై తేలే అలలు

అయితే పదాలూ, వినటమూ ఆగిపోయాక
ఏదో ఉత్తఖాళీ మిగులుతుంది చూసావా,
ఏమిటది!
పదాలూ, నువ్వూ, నేనూ ఏమీ కానిది!

4.3.2020 4.30 సాయంత్రం
నవ్య వారపత్రిక 1.4.2020

# నీటిలాంటి..

ఉన్నది ఉంది, లేనిది లేదు
ఉన్నది లేదు, లేనిది ఉంది
ఉన్నదీ ఉంది, లేనిదీ ఉంది
ఉన్నదీ లేదు, లేనిదీ లేదు

ఇది నీటిలాంటి కవిత
గాలి లాంటి కవిత
ఎలా కావాలంటే అలా వంపు తిరుగుతుంది
మడతలు పడుతుంది, సర్దుకుంటుంది
ఎప్పుడు, ఎలా కావాలంటే అలా
మార్చుకొని చదువుకోవచ్చు

అవి ఉత్త పదాలనుకొంటే,
పదాల్లోకి దారి తప్పుతావు
భావాలనుకుంటే భావాల్లోకీ,
అనుభవమనుకుంటే అనుభవంలోకీ తప్పిపోతావు

నీకిప్పుడు కావలసింది
పూలు రాల్చిన కొమ్మలానో,
ఆకులు రాల్చిన చెట్టులానో ఉండటం కాదు
చెట్టుని రాల్చిన ఆకాశంలా ఉండటం
ఆకాశాన్ని రాల్చిన అనంతమై పోవటం

ఉన్నావా, లేవా
ఈ పదాలతో మరో కవిత రాస్తున్నావా
ఎవరో తలుపు తట్టినట్టు
ఏదో నీ నిద్రని తట్టిన చప్పుడయితే చెప్పు

5.7.2020 11.10 ఉదయం గురుపూర్ణిమ
సారంగ 15.9.2020

# భాష

భాష ఎట్లా వాడాలో
మన కిప్పటికి తెలియలేదు
బహుశా, మాట్లాడటం నేర్చుకొనేందుకే
మనం కవిత్వం రాస్తుంటాము

భాష ఇప్పటికి శబ్దం స్థాయికి ఎదగలేదు
మనం అనాదిగా భాషిస్తున్న మాటలన్నీ
ఇప్పటికీ తాము ఒక పక్షి కూతని
అందుకోవటాన్ని కలగంటూ వుంటాయి
తల్లిని అనుకరించే బిడ్డల్లా
అల విరిగిన చప్పుడుని అనుకరిస్తాయి

మనం అనాదిగా ఒకరినొకరు
మరింత బాగా అపార్థం చేసుకోవటానికి
భాషని ఉపయోగించాము
మాట్లాడుకోవడం చాత గాక
యుద్ధాలు చేసుకున్నాము

జయించటమనే పదంలో
తెలియరాని రహస్యముందని భ్రమించి
ఒకరికన్నా ఒకరు బలవంతులు కావటానికి
జీవితాలని ధారపోసాము

కొలనులో తామరలు వికసించినట్టు
మనదైన నిండైన మౌనంలోంచి
మాటల్ని వికసించనీయటమెలానో
నేర్చుకుని వుంటే
ఈ భూమి ఏనాడో స్వర్గతుల్యమయేది

22.8.2020 12.45 మధ్యాహ్నం

# మాట్లాడాలని

ఎవరితోనైనా మాట్లాడాలనిపిస్తుంది

ప్రతిబింబం కొలనుతో మాట్లాడినట్లు
పక్షి నిశ్శబ్దంతో మాట్లాడినట్లు
ఇంద్రధనువు ఆకాశంతో మాట్లాడినట్లు
ఎవరినైనా మాటలతో తాకాలని వుంటుంది

ఎవరి హృదయంలోకైనా
మాటలద్వారా ప్రవేశించాలని వుంటుంది
ఎవరిలోనో స్మృతిదీపమై వెలగాలని వుంటుంది

నీవెవరు, పరులెవరూ
ఎవరినుండి ఎవరిలోకి
ఈ మాటల మెత్తని పదధ్వనులు

నీలో ఏమి మిగిలిందని మాటలలో పంచాలి
ఏమై మిగలాలని మాటలుగా ప్రవహించాలి

ఆకాశం నుండి ఆకాశాన్ని తీసివేసినా
ఆకాశమే మిగిలినట్లు
నీ నుండి నిన్ను మాటల్లోకి ఒంపినా
నువ్వు నువ్వుగానే మిగులుతావు

బహుశా, మాటలన్నీ మౌనంలో కరిగినపుడు
నీవూ, పరులూ
ఒకరిలో కొకరు నిజంగా మేలుకొంటారు

30.3.2018 6.30 సాయంత్రం
నవ్య వారపత్రిక 16.6.2018

## వెలిసిపోనీ..

వెలిసిపోయేవాటిని వెలిసిపోనివ్వాలి
రుతువులు మారినట్టు
ఆకులు రాలినట్టు
గోడల రంగులు వెలిసినట్టు

మనుషుల ముఖాలు వెలిసిపోతాయి
బంధాలు వెలిసిపోతాయి

నీ ప్రాధాన్యతలూ
ఊపేసిన ఉద్వేగాలూ
తెలియని లోకాల్లోకి తేల్చిన ఊహలూ
వెలిసిపోతూ వుంటాయి

చిరునవ్వులూ, కన్నీళ్లూ
వాటిని ప్రసవించిన కాలాలూ, దేశాలూ
క్రమంగా జీవితమూ వెలిసిపోతూనే ఉంటాయి

తొలిసారి ఆశ్చర్యమై పలకరించినవన్నీ
మలిసారి వెలిసిపోతే పోనివ్వాలి

ఆశ్చర్య పడినప్పటిలా
హుందాగా, అందంగా, మృదువుగా

ఆశ్చర్యపడటమూ,
వెలిసిపోనీయటమూ
పోగొట్టుకోకుండా వుంటే బావుండేది

జీవిత మిప్పటికీ
బాల్యమంత హాయిగా గడిచేది

20.8.2020 7.16 సాయంత్రం

# కావలసింది

ఎక్కడో ఒకచోట,
ఏదో ఒక కాలంలో పుడతావు
అయితే ఏమిటి

ఏదో ఒక జాతిలో, మతంలో పుట్టి
ఏదో ఒక భాష మాట్లాడతావు
అయితే ఏమయింది

ఎక్కడ పుట్టావో కాదు,
ఏం చేసావో, పొందావో కాదు,
చేసింది ఎలా చేసావో ముఖ్యం
పొందింది ఎలా పొందావో ముఖ్యం

మరికాస్త లోతుల్లోకి చూసినపుడు
ఎలా చేసావో, పొందావో కూడా
రాత్రిలో మునిగిన
సాయంకాలపు నీడల్లా మాయమవుతాయి

ఇక్కడి నుండి వెళ్ళేనాటికి
జీవఫలం ఎంత పండిందో కావాలి
ఎన్ని కన్నీళ్ళతో
చిరునవ్వుని శుభ్రం చేసుకొన్నావో తెలియాలి

అనేక జీవితాలై వెలిగే తెలియరాని కాంతి
నీ రూపంలో
ఏ జీవితాద్భుతాలని దర్శించిందో కావాలి

అలుపెరగని పక్షిలాగా ఎగిరే మనస్సు
తనలోకి ముడుచుకొని
నెమ్మదిగా, నిశ్చింతగా కూర్చోవటమెలానో
గ్రహించిందో లేదో తెలియాలి

ఇన్ని రూపాలుగా, దేశాలు, కాలాలుగా
తనని ప్రదర్శిస్తూ, దర్శిస్తున్న ఏకైక మహాజీవితం

నీ రూపంలోనైనా తనని
నిండైన జీవితంగా తాకిందో, లేదో చూడాలి

21.8.2020 1.50 మధ్యాహ్నం

## సున్నితమైన..

నిన్ను సున్నితమనుకుంటావు గానీ
కవీ, కాదనుకుంటాను

ప్రతి మెలకువ మైదానంలోనూ
ప్రపంచం పలువిధాల పలకరిస్తుంది
పక్షికూతలా, నీటిసడిలా, మనిషిలా, మాటలా
ఎండలా, నీడలా, చీకటి దీపంలా
సుఖంలా, నవ్వులా, ఒంటరి భయంలా

ఎన్నిటికి స్పందించావు చెప్పు
ఎన్ని విధాలుగా, ఎంత సాంద్రంగా

పలకరింపుల్ని తప్పుకుపోతావు చాలాసార్లు
బాటపై రాలిన పూలని తప్పుకొన్నట్లు
ముఖంపై వాలిన నీరెండ స్పృహే లేనట్లు

నువు సున్నితమనుకొంటావు గానీ
బహుశా, కాకపోవచ్చును
ఎంపిక చేసుకున్న తలుపుల్ని
ఎంపిక చేసుకున్న చేతులు తట్టినపుడు
తెరుచుకుంటావు కాబోలును

రానివ్వదలచిన వర్షపు చినుకుల్నీ,
వెన్నెల తునకల్నీ, గాలి తరగల్నీ
జాగ్రత్తగా నిర్ణయించుకొని, అనుమతిస్తావు

నువు పిలిచినవి మినహా
మరేవీ తాకలేనంత కఠినంగా ఉంటూ కూడా
నిన్ను సున్నితమనుకొంటావు కానీ
ఎంత మాత్రమూ కాకపోవచ్చును

పూలకన్నా కోమలత్వంలోకి వికసించగల నీకు
విత్తనంలాంటి ఈ కాఠిన్యం దేనికో
ప్రియమైన కవీ, నీకూ తెలియకపోవచ్చును

13.3.2021 3.20 మధ్యాహ్నం
వివిధ, ఆంధ్రజ్యోతి దినపత్రిక 21.11.2022

# మిగిలిపోతూ

చెప్పవలసిన మాట ఏదో
ఎప్పటికీ మిగిలిపోతూనే వుంటుంది
చేయవలసిన పనేదో
ఇంకా మొదలైనా కానట్లుంటుంది

పొందవలసిన అనుభవమేదో
దూరంగా ప్రవహిస్తున్న ఎండమావిలా
కూర్చోనీయక నడిపిస్తూ ఉంటుంది

చెప్పిన మాటలన్నీ ఒక్కుమ్మడిగా
పెనుగాలికి ఆకులు రాలినట్టు
అర్థం లేకపోవటంలోకి రాలిపోతాయి

చేసిన పనులన్నీ
తాకి చూడటానికి అంగుళం దూరంలోకి
జరిగిపోతూ ఉంటాయి

పొందిన అనుభవాలన్నీ
నిద్రలేచిన ప్రక్కమీద మిగలని కలల్లా
తెలియని కొలతలోకి
చెప్పకుండానే సెలవు తీసుకొంటాయి

ఎప్పటి వెలితి
ఎప్పటి ఆతృత
ఎప్పటి పెనుగులాట

ఎప్పటికీ దుఃఖపు లోతుల్లోంచి
ఊరని సంతోషపు జల

ఎక్కడ ఉన్నావో తెలియకనే
ఎక్కడికి వెళ్ళాలో తెలియకనే
తెలిసిందంతా
ఎక్కడ నిన్ను నిలిపిందో కనుగొనకనే

ఏ రాత్రులు, ఏ పగళ్ళు
ఏ ఆకాశాల లోపల, వెలుపల, చుట్టూ
నువ్వు మిగిలావు
నువ్వు నిలిచావు
నువ్వు తడిశావు

5.11.2020 1.15 మధ్యాహ్నం
ప్రజాశక్తి దినపత్రిక 7.2.2021

# వెళదామా..

బొమ్మలు గీయి,
రంగులు వేస్తూ వాటిలోకి తప్పిపో
పాటలు పాడు,
స్వరాల అలలపై సవారి చేయి

ప్రేమించు కళ్ళు మెరిసేలా,
హృదయం పగిలి కన్నీటికాల్వలు కట్టు
తోచినట్టు బ్రతుకు,
బ్రతికినదానికి దుఃఖపడు లేదా తృప్తిపడు

నువ్వు వెళ్ళగానే
అద్దంలోని ముఖం వెళ్లిపోయినంత నిశ్శబ్దంగా
నీలోంచి ప్రతిదీ వెళ్ళిపోతుంది

గోడమీద వాలిన బంగారుకాంతిలా
ఆనవాలైనా మిగలకుండా మాయమౌతుంది

మనం ఒకప్పుడు ఆడిన ఇసుకతిన్నెల్లో
ఇవాళ ఈ పిల్లలు ఆడుతున్నారు

మన హృదయాల్ని చల్లబరిచిన వెన్నెల్లో
ఆ యువతీయువకులు బిడియపడుతూ
హృదయాల్నీ, మౌనాన్నీ విప్పుకొంటున్నారు

ప్రతిదీ ఉండటమెంత బావుందో
వెళ్ళిపోవటమంత బావుంది
మనమిక వెళదామా
వచ్చినంత సంతోషంగా, నిశ్శబ్దంగా..

26.9.2020 3.20 మధ్యాహ్నం
కవిసంధ్య ఏప్రిల్ 2021

# వీడ్కోలు!

1

ఇక ఉంటాను
ప్రేమించినవారికి ధన్యవాదాలు
ప్రేమించలేనివారికి క్షమాపణలు
ప్రేమిస్తూ, ద్వేషించినవారికి దీవెనలు
ద్వేషిస్తూ, ప్రేమించినవారికి నమస్కారాలు

2

మనుషులందరిలో ఉన్నట్టే,
ఇతనిలోనూ వెలుగునీడలున్నాయి
వెలుగే చూసి నీడలు లేవని అపోహవద్దు
ప్రశాంతత చూసి కోపం రాదనీ,
నవ్వు చూసి ఏడ్పు ఉండడనీ ఊహించవద్దు

రహస్యం చెబుతున్నాను
ఒకదాని సంపూర్ణత తెలియకుండా
మరొకటి జీవితంలోకి రానే రాదు
ఒకటి సహజంగా వికసించకపోతే
రెండవదీ వాడిపోతుంది

ఇతనికేమైనా ప్రతిభ ఉంటే,
దాని బలమైన పునాది ఒకే ఒక్క కోరిక
'అందరూ బావుండాలి'

3
ఉత్త ఆనందం తప్ప జీవితానికి అర్థమేమీ లేదని,
ఆకాశమంత బాధపడ్డాక కానీ తెలియదనుకొంటాను

భరించలేని దుఃఖాలని
ఎవరిపైనా నెపం వేయకుండా స్వీకరించిన తరువాత
ఆ అనుభవం చెవిలో చెప్పిన రహస్యం ఒక్కటే
'జీవితం చాలా గొప్పది'

4
నిన్ను నిజాయితీగా చూసుకో
ఏమీలేని, ఏమీకాని నిజమైన నిన్ను
అమాయకంగా, సరదాగా ప్రేమించటం మొదలుపెట్టు
ఉత్త ఖాళీలాంటి నిర్మలమైన జీవితానుభవం
నీ ముందు తలుపులు తెరుస్తుంది

5
నిజంగా ప్రేమించేవారికి
వాళ్ళూ, నువ్వూ వేరుకాదని చెప్పకముందే తెలుస్తుంది
ద్వేషించేవారికి, మనం ఒకటేనని వివరించినా తెలియదు
కనుక మాటలు అర్థంలేనివి

మాటలు మరికాస్త మేలుకొల్పలేనపుడు
మౌనం ఆ పని చేయగలదేమో చూడాలి

ప్రేమతో..
సెలవు

23.06.2016 12.00 మధ్యాహ్నం

# నేపథ్యంలో..

ఈ కవిత్వం రాసుకొన్న కాలం (2016-22) ఎన్నో చిక్కటి వెలుగునీడలు అనుభవించిన కాలం, వియోగాల్ని చూసిన కాలం. వాటిలో ముఖ్యమైనవి ఆత్మసహచరుడిగా భావించే ఆలపాటి రాంబాబుగారు కాలగతి (మే 2018) చెంది, లోలోతుల్లోని అన్వేషణలో ఒంటరిగా మిగలటం ఒకటి, కన్నతండ్రి కాలం చేసి (మే 2021), గాఢమైన వియోగాన్నీ, బాధ్యతలనీ మోయవలసి రావటం మరొకటి. ఈ రెండు ఏకాకి అనుభవాల మధ్యకాలంలో చూసిన ముఖ్యమైన వెలుగు శ్రీ సుబ్రహ్మణ్యంగారు (శ్రీ కాళహస్తి). ఆత్మీయులు గంగారెడ్డి వలన కలిగిన వీరి పరిచయమూ (నవంబర్ 2019), మాటలూ, శ్రీ రమణుల, శ్రీ నిసర్గదత్తుల బోధనల తర్వాత ఇతన్ని మరింత సూక్ష్మ మైన అవగాహనలోనికి మేలుకొలుపుతున్నాయి.

ఈ కవితలలో సింహభాగం (55) జూలై 2020 నుండి మార్చి 2021 లోగా పలికినవి. కోవిడ్ లాక్‌డౌన్‌ల కాలంలో, సన్‌నైట్స్ పేరుతో జూలై 2020 నుండి రమణజీవి, గంగారెడ్డి, ప్రసాదమూర్తి, సౌభాగ్య, వసీరా, మోహన్ రిషి, అప్పుడపుడు అసుర, మూలా సుబ్రహ్మణ్యం, హెచ్చార్కె, జగన్నాథశర్మ, మరికొందరు సాహిత్యమిత్రులూ ప్రతి ఆదివారం రాత్రి వీడియోకాల్‌లో కలిసేవారు. ఆ వాతావరణం కలిగించిన ఉత్సాహం, బహుశా, కవిత్వం ధారగా పలకటానికి ప్రేరణ అయి వుంటుంది. టైటిల్ పోయెం అరుణాచలంలో వచ్చినది. చాలాసార్లు వెళ్ళినా అక్కడ కవిత్వం రాయాలని ఎప్పుడూ తోచలేదు. ఆత్మీయులు ఆకెళ్ళ రవిప్రకాష్‌తో అరుణాచలంలో మాట్లాడిన మర్నాడు ఈ కవిత వచ్చిన గుర్తు.

పుస్తకం ఎడిటింగ్‌లో సహాయం చేసినవారు స్వాతికుమారి బండ్లమూడి, గోపిరెడ్డి రామకృష్ణ. పుస్తకం తెస్తున్న మిత్రులు నామాడి శ్రీధర్, ఒమ్మి రమేశ్‌బాబు, అనంత్. వీరికీ..

ఈ కవిత్వాన్ని ప్రేమించే అనేకమంది సాహితీవేత్తలకీ, మిత్రులకీ, ఆప్తులకీ, ప్రముఖులకీ, వీటిని ప్రచురించిన ప్రింట్, వెబ్ పత్రికల వారికీ, వార్షిక సంచికల వారికీ,

జీవితోత్సాహాన్ని ఆరనివ్వని తొలిప్రాయపు మిత్రులకీ, నన్ను నన్నుగా కాపాడుతున్న కుటుంబానికీ, తోబుట్టువులకీ, పిల్లలకీ, వ్యాపార సహచరులకీ, శ్రేయోభిలాషులకీ,

ఎక్కడో ఒకచోట ఈ వాక్యాలని ప్రేమతో తలుచుకునే, పలికే, రాసే, వివరించే సమకాలీన సాహిత్య మిత్రులకీ, సోషల్ మీడియా మిత్రులకీ, పురస్కారాలతో ఈ కవిత్వాన్ని గౌరవించినవారికీ, ఈ కవిత్వాన్ని ఆర్తిగా చదువుకునే అజ్ఞాత మిత్రులకీ అనేక కృతజ్ఞతలు.

1.2.23 బివివి ప్రసాద్

తణుకు

## *బయోడేటా*

| | |
|---|---|
| పూర్తిపేరు | : బొల్లిన వీర వెంకట ప్రసాద్ |
| పుట్టినతేదీ | : 21. 11. 1966 |
| పితామహులు | : బొల్లిన వీరన్న, సత్యనారాయణమ్మ-ముక్కామల, ప.గో.జిల్లా |
| మాతామహులు | : భోగవల్లి సుబ్బారావు, సూర్యకాంతం-సూర్యారావుపాలెం, ప.గో.జిల్లా |
| తల్లిదండ్రులు | : విజయలక్ష్మి, అచ్యుతం |
| తోబుట్టువులు | : నాగేంద్రకుమార్, శ్రీ భవాని |
| భార్యాపిల్లలు | : మాలతీదేవి, గాయత్రి, భార్గవి |

| | | | |
|---|---|---|---|
| రచనలు | : ఆరాధన | (వచన కవిత్వం) | 1989 |
| | దృశ్యాదృశ్యం | (హైకూలు) | 1995 |
| | హైకూ | (హైకూలు) | 1997 |
| | పూలురాలాయి | (హైకూలు) | 1999 |
| | నేనే ఈ క్షణం | (వచన కవిత్వం) | 2006 |
| | ఆకాశం | (వచన కవిత్వం) | 2011 |
| | నీలో కొన్నిసార్లు | (వచన కవిత్వం) | 2015 |
| | ఊరికే జీవితమై | (వచన కవిత్వం) | 2023 |

| | | |
|---|---|---|
| పురస్కారాలు | : ఆంధ్ర సారస్వత సమితి అవార్డు, మచిలీపట్నం | 2004 |
| | స్నేహనిధి పురస్కారం; విశ్వకళాపీఠం, హైదరాబాద్ | 2012 |
| | ఇస్మాయిల్ కవితా పురస్కారం, కాకినాడ | 2011 |
| | గుంటూరుజిల్లా రచయితలసంఘం అవార్డు, గుంటూరు | 2011 |
| | నూతలపాటి కవితా సత్కారం, తిరుపతి | 2011 |
| | కె.వి.ఎస్. ఉగాది సాహిత్య పురస్కారం, ఏలూరు | 2015 |
| | తిలక్ అవార్డు, తణుకు | 2016 |


చిరునామా : బివివి ప్రసాద్, # 23-12-21, సజ్జాపురం, తణుకు,
పశ్చిమ గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్ 534 211

ఫోన్ : 90320 75415

ఈ మెయిల్ : prasadbvv1@gmail.com

బ్లాగ్ : bvvprasad.blogspot.com

# ప్రేమలేఖ ప్రచురణ

కవిత్వం

1. సత్యం వద్దు స్వప్నమే కావాలి (2016) : శివలెంక రాజేశ్వరీదేవి
2. ద్వీపకూటమి (2016) : అనంతు చింతలపల్లి
3. అంగారస్వప్నం (2017) : ఊర్మిళ
4. లీనాలీనం (2018) : గడియారం యాజ్ఞవల్క్యశర్మ
5. ఆత్మహత్యా సదృశ్య దేశదిమ్మరి ఆఖరి కోరిక పత్రశకలం (2018) : చిత్రకొండ గంగాధర్
6. అంటరాని ప్రేమ (2019) : కలేకూరి ప్రసాద్
7. తూనీగతో సాయంత్రం (2021) : తెలుగు వెంకటేష్
8. ఎన్నో రంగుల చీకటి (2022) : కోడె భారతి
9. కంచె దాటే పాట (2022) : జి.వెంకటకృష్ణ
10. స్వీయచిత్రం (2022) : సివిఎస్ మహేష్
11. అబ్బాస్ కియారొస్తమి కవితలు (2023) : ఎంపిక, అనువాదం: అనంతు చింతలపల్లి

కథ

12. ఫోర్ స్క్వేర్ (2016) : అనంతు చింతలపల్లి

నాటకం

13. యాంటిగని (2021) : సోఫోక్లీజ్ అనువాదం : అనంతు చింతలపల్లి
14. పరాయి (2023) : ఆధారం : సాదత్ హసన్ మంటో కథలు

oorike jeevitamai.. poetry by bvv prasad



ఉత్త జీవితం
ఏమీ లేని జీవితం
ఖాళీ జీవితం
ఎప్పుడైనా తాకిందా నిన్ను

ఊరికే చూసావా జీవితాన్ని జీవితంగా
అద్దంలోకి కాక, ఉత్త అద్దాన్ని చూసినట్టు
జీవితంలోకి దూకకుండా ఉత్త జీవితాన్ని చూసావా

ప్రేమ లేఖ ప్రచురణ